# నందిని



ఆత్మీయులు దూరంగా ఉన్నప్పుడు మన అభిమానాన్ని తెలుసుకుందామనీ, వారిని పలుకరించి, వారిని మారు పలికింప చేయటంలో ఆనందం పంచుకుందామనీ, ఆత్మీయత పెంచుకుందామనీ అభిలషిస్తాము. పండుగల సందర్భాలలో గ్రీటింగ్ కార్డులు పంపడం ఈ అభిప్రాయంతోనే కదా.

కేవలం ఒక్క రూపాయితో భారతదేశంలో మీ సన్నిహితు లెక్కడున్నా సరే వారు మిమ్మల్ని సంవత్సరంపాటు గుర్తుంచుకునేలా, యువభారతి సంస్థతో పరిచయం కలిగించినందుకు మిమ్మల్ని అభినందించేలా చేయగలుగుతుంది "నందిని."

ఎనిమిది పేజీల్లో ఒక చక్కని సంస్కారాన్ని పరిచయంచేస్తూ, వారు నందినిని అందుకునేందుకు కారణమైన మిమ్మల్ని సంవత్సరంలోని పన్నెండు నెలలూ గుర్తుంచుకునేలా మీ ఆత్మీయతకు క్రొత్త అనుబంధాన్ని పెనవేయగలుగుతుంది. అటు అందుకుంటున్నవారికి ఆనందం, ఇటు అందిస్తున్న మీకు సంతృప్తిని సమానంగా పంచిపెడుతుంది "నందిని" అందుకే అర్థిస్తున్నాము. మీ నుండి కేవలం ఒక్కరూపాయి + మీ మీ ఆత్మీయుల చిరునామాలు.

మీ రెన్ని రూపాయిలైనా పంపవచ్చు. అన్ని చిరునామాలు పంపాలన్నది మాత్రం గుర్తుంచుకోండి.

వేలమంది సహృదయులకు సన్నిహితం కావాలన్న లక్ష్య సాధనలో తోడ్పడండి.




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# అందుబాటులో ఉన్న
# సాహితీవాహిని తరంగాలు

| | | | |
|---|---|---|---|
| 1. | మందార మకరందాలు | ... | రూ. 2-00 |
| 2. | ప్రజాసూక్తం | ... | ,, |
| 3. | వేమన్న వేదం | ... | ,, |
| 4. | వడగళ్ళు | ... | ,, |
| 5. | నా గొడవ | ... | ,, |
| 6. | శ్రీనాథుని కవితా వైభవం | ... | ,, |
| 7. | విశ్వనాథ కవితా వైభవం | ... | ,, |
| 8. | శిఖరాలు - లోయలు | ... | ,, |
| 9. | సిందూరం | ... | ,, |
| 10. | భావన | ... | ,, |
| 11. | మెరుపులు | ... | ,, |
| 12. | చేమకూర కవితా వైభవం | ... | ,, |
| 13. | తిక్కన కవితా వైభవం | ... | ,, |
| 14. | చలం ఆలోచనలు | ... | ,, |
| 15. | భారతీ వైభవం | ... | ,, |
| 16. | తిమ్మన కవితా వైభవం | ... | ,, |
| 17. | ధూర్జటి కవితా వైభవం | ... | ,, |
| 18. | తులసీదాసు కవితా వైభవం | ... | ,, |
| 19. | నన్నయ కవితా వైభవం | ... | ,, |
| 20. | ధర్మపథం | ... | ,, |
| 21. | శతక సౌరభం | ... | ,, |
| 22. | నన్నెచోడుని కవితా వైభవం | ... | ,, |
| 23. | సూరదాసు కవితా వైభవం | ... | ,, |
| 24. | కాళిదాసు కవితా వైభవం | ... | ,, |

# కాళిదాస కవితా వైభవము

''కాలిదాస కవితా నవం వయో మాహిషం దధి సశర్కరం పయః. శారదేందు రబలాచ కోమలా సంభవన్తు మమ జన్మ జన్మని" అని అంటూ ఒక రసిక శిఖామణి తనకు, కాళిదాస మహాకవి కవిత్వమూ, నూత్న యౌవనమూ, గేదెపాలు తోడుపెట్టినపెరుగూ, పంచదారవేసిన పాలూ, శరత్కాల చంద్రికా, కోమల వయస్సులో ఉన్న సుందరాంగి ఇవన్నీ జన్మ జన్మలా లభిస్తూ ఉండాలని కోరు కొంటూ, ఈ వస్తువుల్లో కాలిదాస కవితకు అగ్రస్థానం ఇస్తాడు.

పూర్వం ఒకనాడు మహాకవులు ఎవరున్నారా అని కొందరు సహృదయులు కూర్చుని లెక్కవేసుకోవడంలో వెంటనే 'కాలిదాసు' అని పేరు చెప్పుకొని చిటికిన వ్రేలు ముడువడం జరింగిందట. నాటినుండి నేటివరకూ అ పేరు ప్రక్కచేర్చడానికి మరోపేరు ఏదీ లభించక పోవడంతో రెండవ వేలు అనామికగా, అంటే పేరు లేని వేలుగా ఉండిపోయింది – అని అంటాడు మరొక కవి.

"పురా కవీనాం గణనా ప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాలిదాసా.
అద్యాపి తత్తుల్య కవే రభావాత్ అనామికా సార్థవతీ బభూవ."

ఈ విధంగా సంస్కృత మహాకవుల్లో కాలిదాసుకు అగ్రస్థానం ఇస్తూ వర్ణించే శ్లోకాలు, జ్ఞాతకర్తృకాలూ, అజ్ఞాతకర్తృత్వకాలూ ఎన్నో లభిస్తాయి. బాణ, జయదేవ, రాజశేఖర, అభిరామాది మహాకవుల మన్ననల్ని మాత్రమే కాకుండా, కాలిదాసు ఆనందవర్ధనాది మహావిమర్శకుల ఆదరాన్నికూడా పొందకలిగాడు. ''అతివిచిత్రమైన కవి పరంపరతోకూడిన ఈ సంసారంలో 'మహాకవి' అని చెప్పడానికి తగినవారు, కాలిదాసువంటివారు, ఇద్దరుముగ్గురు, లేదా ఐదారుగురు మాత్రమే మనకు లభిస్తారు'' – "యేనాస్మిన్నతి విచిత్రకవి పరంపరా వాహిని సంసారే కాలిదాస ప్రభృతయో ద్విత్రాః పంచషావా మహాకవయ ఇతి గణ్యన్తే" అని అంటాడా ఆనందవర్ధనుడు. ''కాలిదాసు రచనలో ఉన్న సారం కాలిదాసుకే తెలియాలి, లేదా సరస్వతికీ. బ్రహ్మకూ తెలియాలి నావంటివానికి ఏం తెలుస్తుంది?'' "కాలిదాసగిరా సార కాలిదాసః సరస్వతీ.

చతుర్ముఖోధవా సాక్షాత్ విదుర్నాన్యేతు మానవాః" అని అంటాడు వ్యాఖ్యాతృ చక్రవర్తియైన మల్లినాథుడు.

ఈ విధంగా సంస్కృత మహాకవుల్లో అత్యున్నతస్థానం సంపాదించుకొన్న కాళిదాసు ఏ దేశంలో నివసించేవాడో, ఏ కాలంలో ఉండేవాడో నేటికికూడా వివాదాస్పద విషయాలుగానే ఉన్నాయి. ఇతడు విక్రమార్కుని ఆస్థానంలో, నవ రత్నాలలో ఒకడని, జ్యోతిర్విదా భరణంలోని ఈ క్రింది శ్లోకంద్వారా తెలుస్తూంది.

> "ధన్వంతరిక్షపణ కామరసింహ శంకు వేతాలభట్ట ఘటకర్పర కాలిదాసాః
> ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం రత్నానివై వరరుచిర్నవ
> విక్రమస్య"

ఐతే, ఈ శ్లోకానికి ఎంతవరకు ప్రామాణ్యం ఇవ్వాలి; దానిలో నిర్దిష్టుడైన విక్ర మార్కుడు ఏవిక్రమార్కుడు అనే విషయంలోకూడా విప్రతి పత్తి ఉంది. విక్ర మార్క బిరుదాన్ని స్వీకరించిన గుప్తవంశీయుడైన ద్వితీయ చంద్రగుప్తుని ఆస్థా నంలోనో, ఆ వంశానికే చెందిన సముద్రగుప్త - కుమారగుప్త - స్కందగుప్తులలో ఏ ఒకరి ఆస్థానంలో ఉండేవాడనీ, అందుచే క్రీస్తుశకం తృతీయపంచము శతాబ్దుల మధ్య ఉండి ఉండవచ్చుననీ కొందరి అభిప్రాయం. రఘువంశంలో వర్ణించిన చివరిరాజైన అగ్నివర్ణునికి సమకాలీనుడవడంచేత కాలిదాసు క్రీస్తుకుపూర్వం ఎనిమిదవ శతాబ్దానికి చెందినవాడనే వాదమూ, క్రీ. శ. 11 వ శతాబ్దికి చెందిన భోజమహారాజు ఆస్థానంలో ఉండేవాడనే మరియొక వాదమూకూడా ఆధారరహి తములే. భోజమహారాజు ఆస్థానంలోనూ. గుప్తవంశీయుల కాలంలోనూకూడా కాళిదాసు అనే పేరుగల వ్యక్తులెవరైనా ఉంటే ఉండవచ్చునుగాని, వారు శాకుంత లాదికర్తయగు కాలిదాసుకంటె భిన్నులనీ, మన కాలిదాసు మూలవికాగ్నిమిత్ర నాయకుడైన అగ్నిమిత్రునికి సమకాలీను డవడంచేత క్రీ. పూ. 150 సంవత్సరము ప్రాంతమువాడై ఉంటాడనీ కొందరు భారతీయ విద్వాంసుల అభిప్రాయం క్రీ. పూ. ప్రథమ శతాబ్దంలో ఉజ్జయినిని పాలించిన గర్దభిల్లుని. కుమారుడైన విక్రమాదిత్యుడు తన తండ్రిగారి రాజ్యాన్ని ఆక్రమించిన శకులను ఓడించి క్రీ. పూ. 56 సం. ప్రాంతంలో విక్రమసంవత్సు ప్రారంభించినాడనీ, ఈతని ఆస్థానంలో కాలిదాసు ఉండేవాడనీ చాలామంది భారతీయ పండితుల అభిప్రాయం. ఈ విధంగా కాలిదాసు కాశ్మీరుకు చెందినవాడని కొందరూ. వంగదేశానికి చెందినవాడని కొందరూ, మధ్య

దేశానికి చెందినవాడని కొందరూ, అట్లే క్రీ. పూ. ఎనిమిదవ శతాబ్దానికి చెందిన వాడని కొందరూ రెండవ శతాబ్దానికి చెందినవాడని కొందరూ, ప్రథమ శతాబ్దానికి చెందినవాడని కొందరూ, క్రీ. శ. పంచమశతాబ్దానికి చెందినవాడని కొందరూ, ఏకాదశ శతాబ్దానికి చెందినవాడని కొందరూ, ఈతని దేశకాలాల్ని గూర్చి అనేక విభిన్న వాదాలు ప్రకటిస్తున్నారు. కాలిదాసు ఎక్కడివాడైనా, ఎప్పటివాడైనా ఆతని కవితా వైభవం మాత్రం దేశ కాలాతీతమైనది; తద్వారా ఆతడుకూడా దేశ కాలా తీతుడే అనే విషయంలో మాత్రం ఎవ్వరికీ విప్రతిపత్తి ఉండడానికి అవకాశం లేదు.

**కాళిదాసు రచనలు :** కాలిదాసు రచనలనే పేరుతో ఎన్నో కావ్యాలూ, నాటకాలూ, మంత్రశాస్త్రజ్యోతిః శాస్త్రాది శాస్త్ర గ్రంథాలూ ప్రచారంలో ఉన్నాయి. వాటిలో ఏడు కావ్యాలుమాత్రమే కాలిదాసుమహాకవి రచనలై ఉంటాయనీ, ఇతర గ్రంథాలన్నీ ప్రచారంకోసమై ఆతని పేరుకు చేర్చినవి కాని, తత్సమాన నామ ధేయులైన ఇతరుల రచనలు గాని అయి ఉండాలనీ విమర్శకుల అభిప్రాయం. ఈ రచనల్లో, నాలుగు శ్రవ్యకావ్యాలు, మూడు దృశ్యకావ్యాలు (రూపకాలు).

**ఋతుసంహారము :** ఇది కాళిదాస రచనకాదని కొందరి అభిప్రాయం. ఇది ఆతని ప్రథమరచనయై ఉంటుంది. ఈ కావ్యంలో ఆరుసర్గలూ 144 శ్లోకాలూ ఉన్నాయి. గ్రీష్మవర్ణనంతో ప్రారంభించి ఈ కావ్యం వసంతవర్ణనతో సమాప్త మౌతుంది. దీనిలో చేసిన షడ్ఋతువర్ణన ప్రధానంగా నాయికానాయకులు ఆయా కాలాల్లో అనుభవించే ఆనందాన్ని దృష్టిలో ఉంచుకొని నడిచింది.

**కుమార సంభవము :** ఇది ఎనిమిది సర్గల మహాకావ్యము. పర్వతరాజగు హిమవంతునకు పార్వతి జనించుట, తన శిఖరముపై తపస్సు చేసికొంటూన్న శివుణ్ణి సేవించడానికి హిమవంతుడు ఆమెను నియమించుట, శివుడు పార్వతిని పరిణయ మాడినట్లైతే వారిరువురికీ జన్మించిన కుమారుడు లోకత్రయ కంటకుడైన తారకాసురుణ్ణి సంహరిస్తాడని దేవతలు ప్రేరేపించడంతో మన్మథుడు శివునికి పార్వతిపై అనురాగం కలిగించడానికి ప్రయత్నించి ఆతని కోపాగ్ని గురియగుట, శివుని భర్తగా పొందడానికై పార్వతితపస్సు చేయుట, శివుడు చివరకు అంగీక రించి వివాహమైనపిమ్మట పార్వతీపరమేశ్వరులిరువురూ భోగాన్ని అనుభవించుట, ఈ కావ్యంలోని కథాంశాలు. ప్రస్తుతం కుమారసంభవంలో 17 సర్గలు లభిస్తు న్నాయి. ఐతే 9 వ సర్గమొదలు తొమ్మిది సర్గలూ ప్రక్షిప్తాలనీ, అందుచేతనే

ప్రాచీనాలంకారికాలలో ఏ ఒక్కరూ ఈ సర్గల్లో ఉన్న శ్లోకాన్ని తమ గ్రంథాల్లో ఉదాహరించడం జరగనేలేదనీ పండితుల అభిప్రాయం. పార్వతీ పరమేశ్వరులు పరిణయం ఐనపిమ్మట సుఖంగా భోగాలు అనుభవిస్తున్నారని చెప్పడంలోనే కుమారోత్పత్తి సూచితం ఔతుంది కాబట్టి కాళిదాసు అంతటితో విడిచిపెట్టివేసినాడు. అర్వాచీన కవి ఎవరో, ఈ కావ్యం అసంపూర్ణంగా ఉండిపోయిందని భ్రాంతిపడి ఇకా కొన్ని సర్గలుచేర్చి కథ కుమార సంభవంతో ఆగకుండా తారకాసుర వధవరకూ నడిచేటట్లుగా చేసి ఉంటాడు.

**మేఘసందేశము లేక మేఘదూతము :** ఇది రెండు సర్గల ఖండకావ్యం. దాదాపు 120 శ్లోకాలు ఉన్నాయి. ఈ కావ్యం అంతా అతి మధురమైన మందాక్రాంతా వృత్తంలో నడిచింది. ఇది పాశ్చాత్యుల Lyric కోవకు చెందిన వర్ణనా ప్రధానమైన కావ్యం. ప్రియా విరహంతో బాధపడుతూన్న ఒక యక్షుడు మేఘం ద్వారా ప్రియురాలికి సందేశం పంపడం ఇందులోని ఇతివృత్తం. మొదటి సర్గలో దక్షిణాన్ని ఉన్న రామగిరినుండి ఉత్తరాన్ని ఉన్న అలకా పట్టణానికి మేఘుడు ప్రయాణం చేయవలసిన మార్గం వర్ణింపబడింది. రెండవ సర్గలో మొదట అలకాపురాదివర్ణనా, తరువాత మేఘుడు యక్షుని ప్రియురాలికి అందజేయవలసిన సందేశమూ ఉన్నాయి. ఇది ఎంతో బహుళ ప్రచారాన్ని పొందిన కావ్యం. దానిమీద దాదాపు 40 వాఖ్యానాలు ఉన్నాయి. దాన్ని అనుకరిస్తూ వందలకొలదీ సందేశ కావ్యాలు బయల్వెడలినాయి.

**రఘువంశము :** ఇది 19 సర్గల మహాకావ్యం. ఇందులో రఘువంశానికి చెందిన 29 గురురాజుల కథ – ఏడుగురు రాజుల కథ విస్తృతంగానూ 22 రాజుల కథ అతి సంక్షిప్తంగానూ వర్ణింపబడింది. ఇది కాళిదాసుని శ్రవ్యకావ్యాల్లో అత్యుత్తమమైన కావ్యం.

**రూపకములు-(i) మాలవికాగ్నిమిత్రము :** ఇది ఐదు అంకాల నాటకం. ఇందులో అగ్నిమిత్రునికీ మాలవిక అనే ప్రచ్ఛన్న వేషంలో ఉన్న రాజకుమారికీ మధ్య జరిగిన ప్రణయగాథ కథావస్తువు. మౌర్య వంశీయుల్లో చివరివాడైన బృహద్రథుణ్ణి రాజ్యభ్రష్టునిచేసి క్రీ. పూ. 150 ప్రాంతంలో అధికారంలోనికివచ్చిన పుష్యమిత్రుని కుమారుడు అగ్నిమిత్రుడు. కాళిదాసు ఈతనికి సమకాలికుడు అనికూడా ఒక వాదం ఉంది.

**విక్రమోర్వశీయము :** ఇది పురూరవుడు అనే మహారాజుకూ ఊర్వశి అనే అప్సరసకూ మధ్య ప్రణయగాథను చిత్రించే ఐదంకాల రూపకం. ఇది ఉపరూపకాలలో ఒకటైన త్రోటకం అనే భేదానికి చెందుతుంది.

**అభిజ్ఞాన శాకుంతలము :** ఇది ప్రపంచకంలోని మహాకవుల్లో కాళిదాసుకు ప్రశంసార్హమైన స్థానాన్ని కల్పించిన నాటకం. ఏడంకాల ఈ నాటకంలో శకుంతలా దుష్యంతుల ప్రణయగాథ అత్యద్భుతంగా చిత్రింపబడింది. ఈ నాటకంలో కాళిదాసుని ప్రతిభా విశేషమూ, పరిపూర్ణ లోకానుభవమూ, శిల్పనిర్వహణచాతురీ, ఇవన్నీ ప్రత్యక్షంగా గోచరిస్తాయి. జర్మన్ మహాకవియైన గేటే నాటకాన్ని (అనువాద రూపంలో) చదివి అత్యానందంతో నాట్యంచేసి వేనోళ్ళ దాన్ని పొగడినాడనే విషయం సర్వలోక విదితం.

రచనాక్రమాన్నిపట్టి చూస్తే ఋతుసంహార – కుమారసంభవ – మాలవికాగ్ని మిత్రములు, కాళిదాసు ప్రౌఢ వయస్కుడై ఉన్న ప్రారంభ దశలలో రచించిన కావ్యాలై ఉంటాయనీ, మేఘసందేశ – విక్రమోర్వశీయాలు – ప్రౌఢ వయస్కుడైన కాళిదాసు రచనలనీ, రఘువంశ – అభిజ్ఞాన శాకుంతలాలు, ఆతడు పరిపూర్ణ లోకానుభవాన్ని సంతరించుకొని, జీవితానికి ఉత్తమలక్ష్యమేది అనే విషయంమీద ఒక నిర్ణయానికివచ్చిన పరిణతవయస్సులో రచించిన రచనలై ఉంటాయనీ అనుకోవచ్చు.

**కాళిదాసు మన జాతీయకవి :** మన దేశానికి కాళిదాసు జాతీయకవి. ఈ దేశానికిచెందిన అత్యుత్తమ సాంస్కృతికాదర్శాలను తన కావ్యాల్లో ప్రతిఫలింపచేయడంచేతనే ఈయన మన జాతీయకవిగా వర్ణింపబడుతున్నాడు. "యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్" అని భగవద్గీతలో చెప్పిన యజ్ఞ-దాన-తపములూ, త్యాగమూ అనే నాలుగు స్తంభాలపైనా నిలబడిఉంది భారతీయ సంస్కృతి. వాస్తవానికి యజ్ఞ-దాన-తపస్సులు మూడింటిలోనూ త్యాగం అంతర్గతంగా కొంతగానో, గొప్పగానో ఉంటూనే ఉంటుంది.

ఈ ప్రపంచంలోఉన్న అన్ని జీవరాసుల్లోనూ తానే అత్యుత్తముడననీ, అందుచే ఈ ప్రపంచం అంతా తనకోసమే ఉద్దిష్టమై ఉందనీ మానవుడు అనుకొంటూ ఉండవచ్చు. ఐతే తానూ ఇతర ప్రాణికోటికంటె ఏవిధంగా గొప్పవాడో అదేవిధంగా తనకంటెకూడా అత్యధికమైన ప్రభావాదులుకల ఇంకా ఏవో కొన్ని

శక్తులుకూడా ఉన్నాయనీ, తన స్థూలదృష్టికి ఆ శక్తులు గోచరించనంత మాత్రం చేత వాటి ఉనికినే నిరాకరించడం అనేది మూర్ఖత్వం అవుతుందనీ మానవుడు గ్రహించాలి. అతి పరిమితమైన తన జ్ఞానానికి గోచరించినవాటిని మాత్రమే అంగీకరించడం, అలా గోచరించనివాటిని నిరాకరించడమూ అజ్ఞాన విలసితమే అవుతుంది. ఇలాంటి అజ్ఞానావరణంలోపడి కొట్టుకొంటున్నంతవరకూ మానవునికి ఈ అహంకారమూ, అప్పుడప్పుడు ఈ అహంకారం దెబ్బతింటూ ఉండడమూ, చివరకు తాను సర్వథా అశక్తుణ్ణనే భావం కలగడమూ అనివార్యాలే అవుతాయి. కొంతమంది మహామేధావంతులైన క్రాంతద్రష్టలు ఈ అజ్ఞానావృతమైన సంకుచిత దృష్టిని అతిక్రమించి, ఒక లోకాతీతదృష్టిని సంపాదించుకొని మానవునికంటెకూడా ఉత్తమ ప్రభావంగల కొన్ని శక్తులు ఉన్నాయనీ, అవి సాకారాలైనా నిరాకారాలైనా, వాటి స్వరూప స్వభావాలు ఎలాఉన్నా ఈ ప్రపంచం నడకలో వాటి సహకారం ఎంతైనా అవసరమనీ మనకు వేనోళ్ళ చాటిఉన్నారు. మనకు వాళ్ళ సహకారం ఎంత అవసరమో వాళ్ళకి మన సహకారంకూడా అంత అవసరం. మానవుడు చిన్నచూపు చూసే పశుపక్ష్యాదులన్నీ ఒక్కమారుగా కూడబలుక్కొని మానవునిపై నియమబద్ధంగా దాడిచేస్తే మానవుని మనుగడకే ఏ విధంగా ముప్పు వాటిల్లుతుందో, మానవుల పూర్తి సహకారం లేకపోతే మనం దేవతలనే వాళ్ళగతికూడా అంతే. వీరి ఇరువురిమధ్యా ఉండవలసిన సహకారమే యజ్ఞం అనేది. మానవుడు కొంత త్యాగం అలవరచుకొని, కృతజ్ఞతా బుద్ధితోటీ, కర్తవ్యతా జ్ఞానంతోటి ఈ పంచవిధ యజ్ఞాలు చేయాలి. దేవతల సంతోషానికే చేసే పూజా పురస్కారాదులు దేవయజ్ఞం. తమ వంశంలోని పూర్వీకులను స్మరిస్తూ, వారిని కృతజ్ఞతా భావంతో శ్రాద్ధాదులద్వారా పూజిస్తూ, సత్సంతానం కని వంశం నిలపెట్టడం అనేది పితృయజ్ఞం. సాటి మానవులయెడ ప్రేమభావంతో వారికి యథాశక్తిగా అన్నాది దానంచేత సహాయం చేయడం మనుష్య యజ్ఞం. మనుష్యుల విషయంలోనేకాదు, పశుపక్ష్యాదుల విషయంలోకూడా ప్రేమభావం చూపుతూ వాటికి ఆహారాదులు అందచేయడం భూత యజ్ఞం. మనకు ఇంతటి విజ్ఞానాన్ని అందచేసిన ప్రాచీనులైన మహా మేధావుల విషయంలో గౌరవ భావంతో, వారు అందజేసిన విద్య నశించిపోకుండా దాన్ని కాపాడుకోవడం ఋషియజ్ఞం. ఈ ఐదు విధాలైన యజ్ఞాలకీ, వాటి విధాన విశేషాలకీ అన్నింటికీకూడా సామూహికమైన పేరు 'యజ్ఞం' అనేది. ప్రతిఫలాపేక్ష లేకుండా ఇతరులకు యథాశక్తిగా ధన-అన్న-వస్త్రాదులు ఇవ్వడం దానం. త్రికరణ శుద్ధిగా తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూ భోగాలకై అటూ ఇటూ పరుగెత్తుతూన్న

ఇంద్రియాల్ని వశంలో ఉంచుకోవడమే తపస్సు. అరణ్యాలకువెళ్ళి ముక్కుమూసు కొని కూర్చోవడం ఒక్కటే తపస్సుకాదు. వసిష్ఠ కణ్వాదులు అరణ్యాల్లోఉన్న ఆశ్రమాల్లో నివసిస్తూ తపస్సు చేస్తుంటే దిలీప దుష్యంతాదులు రాజ్యాధికారం అనే ఆశ్రమంలో ఉండి తపస్సుచేస్తూన్న మహా తపశ్శాలులు. అని వర్ణిస్తాడు కాళిదాసు. ఇది క్లుప్తంగా యజ్ఞదాన తపస్సుల స్వరూపం. వాటి అన్నింటిలోనూ పైన చెప్పి నట్లుగా త్యాగం ఇమిడియే ఉంది. ఐతే క్రమంగా వైరాగ్యం అలవరచుకొని, ఇత రుల నిర్బంధంతో పనిలేకుండా స్వయంగానే అధికారాదుల్నీ, భోగభాగ్యాల్నీ విడిచిపెట్టడం త్యాగం. భారతీయ సంస్కృతికిచెందిన ఈ నాలుగు సూత్రాల్నీ, చక్కగా, బోధిస్తున్నట్లు తెలియకుండా బోధించిన మహాకవి కాళిదాసువంటివాడు మరొకరు ఎవరూ లేరంటే అతిశయోక్తి కాదు. అందుచేతనే అతడు భారతీయుల జాతీయకవి అయినాడు.

**కాళిదాసు మహాకవి :** కవిత్వం అనేది ఎంతో ప్రయత్నంచేసి సాధించ వలసిన కళ. ఏదో ఒకటి చెప్పడం కవిత్వం కాదు. చెప్పే విధానంలో ఉంటుంది 'కవిత్వం' అంతా ప్రతీ కళకూ పరమ ప్రయోజనం ఆనందమే ఐతే, కవిత్వాకి కూడా పరమప్రయోజనం అదే. కావ్యానికి కీర్త్యుపదేశాదులు ఎన్ని ప్రయోజకాలు ఉన్నాయని చెప్పినా, పరమప్రయోజనం మాత్రం ఆనందమే అని ఆలంకారిక మూర్ధన్యుడైన అభినవగుప్తుడు స్పష్టంగా ధ్వన్యాలోకాలోచనంలో చెప్పిఉన్నాడు-'' తత్ర కవేస్తావత్కీర్త్యాపి ప్రీతిరేవ సంపాద్యా......శ్రోతౄణాంచ వ్యుత్పత్తి ప్రీతీ యాద్యపిస్తః...తథాపి తత్రప్రీతిరేవ ప్రధానమ్. అన్యథా ప్రభుసంమితేభ్యః వేదాదిభ్యః మిత్ర సంమితేభ్యశ్చేతిహాసాదిభ్యః వ్యుత్పత్తి హేతుభ్యః కోస్య కావ్య రూపస్య వ్యుత్పత్తి హేతోర్జాయా సంమితత్వ లక్షణో విశేష ఇతి ప్రాధాన్యేన ఆనంద ఏవోక్తః'' (లోచనము ప్రథమోద్యోతము). దశరూపకకర్త ఇంకొక అడుగు ముందుకు వేసి - ''వ్యుత్పత్తికోసం ఇతిహాసాదులు చదివినట్లుగా, నాట కాదుల్ని కూడా కేవలం వ్యుత్పత్తికోసం మాత్రమే ఎవడు చదువుకొంటాడో, మాధుర్య విముఖుడైన ఆమహానుభవునికి ఒక నమస్కారము'' అని అంటాడు.

''ఆనంద నిఃష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధిః
యోపేతిహాసాదివదాహ సాధుస్తస్మై నమః స్వాదుపరాఙ్ముఖాయ''

పార్యంతికంగా ఉపదేశాదిఫలంఉంటే ఉండవచ్చు; ప్రధానఫలం మాత్రం ఆనందమే అని మన ఆలంకారికుల అభిప్రాయం. ఇందుకు మనకు మామూలుగా అలవాటులో

ఎన్నో విషయాలు ఉదాహరణంగా తీసికోవచ్చు. ఈనాడు అందరూ సినీమాలకి వెడుతున్నారు. ఎందుకు? వినోదం కోసమా విజ్ఞానం కోసమా? కొంత విజ్ఞానం కూడా కలిగితే అభ్యంతరం లేదు కాని, ప్రధానాంగా వినోదంకోసమే వెడుతున్నారని సమాధానం వస్తుంది. కేవలం విజ్ఞానంకోసం అయితే మిగిలిన సిన్నీమాలన్నీ పోయి డాక్యుమెంటరీలు మాత్రమే ప్రచారంలో ఉండవలసి వస్తుంది. కావ్యం విషయంలోకూడా అంతే, ఈ విధంగా ప్రధాన ప్రయోజనమైన ఆనందాన్ని కూర్చాలంటే కవి ఎంతో సావధాన చిత్తంతో కావ్యాన్ని వ్రాయాలి. కథాకథనంలోనూ, భావావిష్కరణంలోనూ, రసనిర్వహణంలోనూ, ఆయా సన్నివేశాదులకు ఉపయోగించే పదాల్ని ఏర్చికొర్చుకోవడంలోనూ, ఆవశ్యకతానుసారంగా నృత్య సంగీతం ఆలేఖ్యాది కళల్నీ ఇతర శాస్త్రాల్నీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉపయోగించుకోవడంలోనూ ఆతడు సిద్ధహస్తుడై ఉండాలి. అందుచేతనే అతిప్రాచీనాలంకారికుడైన భామహుడు – ''కావ్యంలో ఉపయోగానికి రాని శాస్త్రం కాని, శిల్పంకాని, కళకాని, విద్యకాని లేదు; కవి నెత్తిమీద ఎంతభారం ఉన్నది!''

> ''నతచ్ఛాస్త్రంన తచ్ఛిల్పం నసావిద్యానసా కలా
> జాయతే యాన్న కావ్యాంగం అహోభారోమహాన్ కవేః''

అంటాడు. ఇంతభారం మోయగలిగినవాడే మహాకవి. అల్లా కాదు నేను ఏదో ఉపదేశం ఇవ్వడంకోసం కవిత్వం వ్రాస్తున్నానంటే – ఆ వ్రాసేదాంట్లో పై లక్షణాలుంటే అది కావ్యం అనడంలో ఎవరికీ అభ్యంతరం ఉండదు లేకపోతే మాత్రం దానికి కావ్యం అనే పేరు కాకుండా శాసనం లేదా శాస్త్రం అనీ; తద్రచయితకు 'శాస్త్రి' అనే పేరుపెట్టుకోవడం మంచిది. అందుచేతనే ఉపదేశంకోసం బయలుదేరిన ఛందోబద్ధమైన మనుస్మృతిని మనుస్మృతి మహాకావ్యం అని ఎవరూ అనరు. ఇది కావ్యము అని చెప్పడానికి ఒక్క పరీక్ష ఏమిటంటే ఒక కావ్యంలోనున్న కథలో కాని, అందులో గోచరించి ఉపదేశంలో కాని ప్రామాణ్యబుద్ధి ఉన్నా లేకపోయినా కావ్యంలో ఉన్న కవితా సౌందర్యం పఠితను తల ఊపేటట్లు చేయాలి. అది నిజమైన కావ్యం. కొంతమందికి 'పారడైస్ లాస్టు'లో ఉన్నకథలోనూ, తదుపదేశంలోనూ విశ్వాసం లేకపోవచ్చు. కొందరికి రామాయణ రఘువంశాది కథల్లోనూ, వాటి ఉపదేశాల్లోనూ ప్రామాణ్యబుద్ధి లేకపోవచ్చు. ఐనా వాటిలో ఉన్న కవితాసౌందర్యానికి ముగ్ధుడు కాకుండా ఏ సహృదయుడూ ఉండలేడు. అందుచేత వాటికి కావ్యత్వం ఉందనడంలో సందేహం లేదు.

ఈ దృష్టితో చూస్తే వివిధ రసపరిపోషణలోనూ, రసానుగుణ రచనలోనూ, ఉపమాద్యలంకార ప్రయోగంలోనూ, కథా సంవిధానంలోనూ, సమయానుగుణంగా సంగీత నాట్య చిత్రకళాదుల్ని ఉపయోగించుకోవడంలోనూ, ప్రసన్న మధురమైన రచన సాగించడంలోనూ, కాళిదాసుకు కాళిదాసే సాటి. ఒక మహాకవి యొక్క గొప్పతనంఅంతా తాను ఏ విషయాన్ని పఠితలకు ఉపదేశించాలని అనుకుంటాడో దాన్ని ఉపదేశిస్తున్నట్లు తెలియకుండా ఉపదేశించడంలోనే ఉంటుంది. అంటే మహాకవి కవితాసౌందర్యం అనే అందమైన ప్రావరణంలో ఆ ఉపదేశాన్ని మన కంద చేస్తాడు. ఆ దృష్టితో చూస్తేకూడా ఆనందవర్ధనుడు చెప్పినట్లు మహాకవులని చెప్పకలిగిన ఐదారుగురులో కాళిదాసు గౌరవార్హమైన స్థానాన్నిని తగిఉన్నాడు.

**కాళిదాసు శివభక్తుడు :** వైదికధర్మ శ్రద్ధాళువైన కాళిదాసు శివకేశవులకు అభేదాన్నీ, సమగౌరవాన్నీ ఇచ్చే సమబుద్ధి కలవాడుగా గోచరించినా ప్రధానంగా శివభక్తుడుగా కనిపిస్తాడు. ఇందుకు ఇతని పేరే కొంతవరకు తార్కాణంగా తీసికోవచ్చు. పైన పేర్కొన్న ఏడు కావ్యాలలో ఋతుసంహార - కుమారసంభవ - మేఘసందేశాల ప్రారంభంలో ప్రార్థనా శ్లోకాలు లేవు. వాటిలో కుమారసంభవం పార్వతీపరమేశ్వర కథా వర్ణనాత్మకమే. శివుని విషయంలో ప్రసిద్ధంగా ఉన్న దిగంబరత్వ శ్మశానవాసిత్వాదుల్ని చూచి శైవేతరులు చేసే అధిక్షేపణకు సమాధానం చెప్పాలనే ఉద్దేశంతో, ఆ ఆక్షేపణలేవో శివుని నోటితోటే చెప్పించి వాటికి సమాధానం పార్వతిద్వారా చెప్పించడానికే పంచమసర్గలో ప్రయత్నించాడా అని తోస్తుంది. రఘువంశంలో రాముణ్ణి కేవలం పురుషోత్తముణ్ణిగా కాక విష్ణ్వవతారంగానే భావించి వర్ణించాడు కాళిదాసు, అందుచేత ఇది విష్ణువుపైకూడా ఈతనికిగల భక్తికి తార్కాణం. వీరిద్దరికీ భేదం ఏమీలేదని స్వయంగానే కుమారసంభవంలో చెప్పాడు కూడా. అయినా రంఘువంశ ప్రార్థనా శ్లోకంలో పార్వతీ పరమేశ్వరులను స్తుతించడం జరిగింది. మేఘసందేశంలో కూడా సమయం లభించినపుడల్లా పరమేశ్వరుణ్ణి స్తుతించాడు. మూడురూపకాల నాందీ శ్లోకాల్లోనూ ఈశ్వరుణ్ణే స్తుతించాడు. దీనినిబట్టి శివకేశవాదులకు అభేదాన్ని అంగీకరించిన వాడైనా కాళిదాసుకు వైయక్తికంగా శివునిమీద ఎక్కువభక్తి ఉన్నట్లు స్పష్టం అవుతుంది.

ఇంక కాళిదాసు కవితలోని సౌందర్యాన్ని కొంతవరకూ చూరకొందాం.

**ఋతు సంహారము :** ఈ కావ్యంలో నాయకుడు నాయికను సంబోధిస్తూ ఆయా ఋతువుల్లో మార్పు చెందుతూన్న ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించి చెపుతూ

ఆ యా కాలాల్లో యువతీ యువకులు ఏ విధంగా సౌఖ్యాలు అనుభవించడానికి వీలుగా ఉందో చెపుతాడు. ఈ విధంగా ఇందులో ప్రకృతిని చాలావరకూ ఉద్దీపనంగా చిత్రించడం జరిగింది. ఇతర వర్ణనలుకూడా లేకపోలేదు.

గ్రీష్మఋతువులో జనులు చంద్రునిచే కడిగివేయబడిన చీకట్లుగల రాత్రులనూ, జలయంత్ర గృహాలనూ, చంద్రకాంతాది మణులనూ, సరసమైన చందనాన్నీ సేవిస్తున్నారట.

''నిశాఃశశాంకక్షత నీలరాజయః క్వచిద్విచిత్రం జలయంత్ర మందిరమ్
మణిప్రకారాః సరసంచ చందనం శుచౌప్రియే! యాన్తి జనస్య
సేవ్యతామ్'' (1.2)

ఈ గ్రీష్మంలో సూర్యకిరణాల వేడికి తాళలేక, దప్పికొని, నీళ్ళకోసమై వెదకుతూ, ఎండిపోయిన కంఠంనుండి కొన్ని జలబిందువులు పైకి రాలుస్తూ, (ముఖము తడుపుకొంటున్న) ఏనుగుల పక్కనే ఉన్న సింహాన్ని చూచికూడా భయపడడం లేదట.

''విశుష్క కంఠాహృత శీకరాంభసో గభస్తిభిర్భానుమతోఽనుతాపితాః
ప్రవృద్ధ తృష్ణోపహతా జలార్థినో నదంతినః కేసరిణోపి బిభ్యతి'' (1.15)

శిశిర ఋతువులో స్త్రీలు తాంబూల - కస్తూర్యాది విలేపన - పుష్పమాలాదులను గ్రహించి, ఆసవంతో ముఖపద్మాన్ని పరిమితం కలదాన్నిగా చేసికొని కాలాగురుధూపంలో సువాసన కల్పించిన శయ్యాగృహంలోకి తొందర తొందరగా ప్రవేశిస్తున్నారట.

''గృహీత తాంబూల విలేపన స్రజః సుఖాసవామోదిత వక్త్రపంకజాః
ప్రకామకాలాగురు ధూపవాసితం విశన్తి శయ్యాగృహముత్సుకాః స్త్రియః
(5-5)

వృక్షాలన్నీ పువ్వులతో నిండి ఉంటాయి. జలాశయాలు పద్మాలతో నిండి ఉంటాయి. స్త్రీలు కామినులై ఉంటారు. వాయువు సుగంధభరితమై ఉంటుంది. సాయం సమయాలు సుఖప్రదంగా ఉంటాయి. పగళ్ళుకూడా రమ్యంగానే ఉంటాయి. ఈ విధంగా వసంత ఋతువులో ప్రకృతి అంతా మనోహరంగానే ఉంటుందట.

"ద్రుమాః సపుష్పాః సలిలం సపద్మ స్త్రియః సకామాః పవనః సుగన్ధిః
సుఖాః ప్రదోషాః దివసాశ్చరమ్యాః సర్వం ప్రియే చారుతరం వసన్తే"
(6-2)

బహుగుణరమణీయో యోషితాం చిత్తహారీ
పరిణత బహుశాలి వ్యాకుల గ్రామసీమా
సతతమతి మనోజ్ఞః క్రౌంచమాలా పరీతః
ప్రదిశతు హిమయుక్తః కాలఏషః సుఖంతః

"అనేక గుణములతో సుందరముగా ఉన్నదీ, స్త్రీల మనస్సులను ఆకర్షించేదీ, పండిన వరిచేలతో నిండిన గ్రామసీమలు కలదీ, రోజంతా మనోహరంగానే ఉండేదీ, క్రౌంచపక్షుల పంక్తులతో వ్యాప్తమైనదీ, మంచుతో నిండినదీ అయిన ఈ హేమంత ఋతువు మీ అందరికీ సుఖము ఇచ్చుగాక॥" (4.18),

**కుమార సంభవము :** ఈ మహాకావ్యం, భారతదేశాన్ని రక్షించే రక్షక భటుడువలె ఉత్తర సీమాంతంలో నిలిచిఉన్న హిమవత్పర్వతముయొక్క వర్ణనంతో ప్రారంభం అవుతుంది.

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమలయోనామ నగాధిరాజః
పూర్వాపరే వారి నిధీవిగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదండః" (1-1)

"తూర్పుసముద్రంనుండి పశ్చిమసముద్రంవరకూ వ్యాపించి భూమినికొలిచే మానదండమా అన్నట్లు, ఉత్తర దిక్కున హిమాలయ మనే పర్వత రాజు ఉన్నాడు. ఇతనికి స్థూలంగా కనిపించే శిలారూప శరీరమే కాకుండా తదధిష్ఠాన భూతమైన దేవతామూర్తికూడా ఒకటి ఉన్నది".

హిమవంతుడు 'మేనా' అనేభార్యను వివాహముడినాడు. ఆమెయందు ఆతనికి మైనాకుడనే పుత్రుడు జన్మించినాడు. దక్షుని కుమార్తెయైన సతీదేవి తన భర్తయైన శివుని తండ్రి అవమానించడంచేత దుఃఖించి, ఆ దేహాన్ని చాలించి మేనకయందు పార్వతిగా జన్మించింది. "కుమార్తెగా జన్మించిన ఆమెతో హిమవంతుడు, కాంతితోకూడిన జ్వాలతో దీపమువలె, ఆకాశగంగా ప్రవాహముచే స్వర్గమార్గమువలె, సంస్కార సంపన్నమైన వాక్కుతో పండితుడువలె పవిత్రీకృతుడైనాడు; అలంకృతుడైనాడు".

''ప్రభామహత్యా శిఖయేవదీపః త్రిమార్గయేవ ఆదివస్య మార్గః
సంస్కారవత్యేవ గిరా మనీషీ తయా సపూతశ్చ విభూషితశ్చ''.(1 28)

క్రమంగా ఆమెకు యౌవనోదయం అయింది. ''నవయౌవనంచేత స్పష్టమైన అవయవ విభాగంకలదై అన్యూనానతి రిక్తమైన ప్రమాణాలుగల ఆమె శరీరము, కుంచెతో రంగులువేసి తీర్చిదిద్దిన చిత్తరువువలె, సూర్యకిరణ స్పర్శచే వికసించిన పద్మమువలె శోభించినది''.

''ఉన్మీలితం తూలికమేవ చిత్రం సూర్యంశుభిర్భిన్న మివారవిన్దమ్
బభూవతస్యా శ్చతురస్రశోభివపుర్వి భక్తం నవ యౌవనేన'' (1.32).

ఒకనాడు నారదుడు వచ్చి ''ఈమె శివుని అర్ధాంగి కాబోతుందని హిమవంతునితో చెపుతాడు. అందుచేత హిమవంతుడు మరొక వివాహప్రయత్నం ఎమీ చేయలేదు. ''శివుడువచ్చి తనను కోరకముందే ఈమెను అయనకు ప్రతిపాదించడానికి కూడా వెనుకాడినాడు. తమ కోరికను ఇతరులు మన్నిస్తారో మన్నించరో అనే సందేహంచేత సత్పురుషులు తమకిష్టమైన విషయాల్లో కూడా ఔదాసీన్యాన్ని వహించి ఉంటారు''.

''అయాచితారం నహిదేవదేవ మద్రిః సుతాంగ్రాహ యితుం శశాక
అభ్యర్థనా భంగభయేన సాధుర్మాధ్యస్థ్య మిష్టేప్యవలంబితేఽర్థే'' (1.51)

శివుడు సతీవయోగంతో వైరాగ్యంపొంది హిమాలయ శిఖరాలు చేరి తపస్సు చేసుకొంటూ ఉంటాడు. ఆయనకు పరిచర్యలు చేయడానికై హిమవంతుడు సఖీసమేతయైన పార్వతిని ఆయన ఆశ్రమంలో ఉంచుతాడు ''స్త్రీ సన్నిధానం తపస్సుకు అంతరాయకరమైనా శివుడు ఆమె శుశ్రూషను అంగీకరించాడు. ఎవరి మనస్సులు వికారం పొందడానికి తగు కారణాలు ఉన్నా వికారం చెందవో వారే కదా ధీరచిత్తులు ?''.

''ప్రత్యర్థి భూతామపి తాం సమాధేః శుశ్రూషమాణాం గిరిశోనుమేనీ.
వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం నచేతాంసి తఏవధీరాః'' (1.59).

(ద్వితీయసర్గ) ఇంతలో బ్రహ్మవల్ల వరాలుపొంది, ముల్లోకాలనీ బాధిస్తూన్న తారకాసురుణ్ణి సంహరించడానికి ఉపాయం చెప్పమని కోరుతూ దేవతలందరూ బ్రహ్మదగ్గరకు వెడతారు. ''ఇంద్రాదిదేవతలు ఆ తారకుని అనుగ్రహంకోసం

ఉపాయనదా నాదులతో ఎంత ప్రయత్నంచేసినా రోజురోజుకూ వాని ఈ దౌష్ట్యం పెరిగి పోతున్నది కాని తగ్గడంలేదట. దుష్టుడు శమించాలంటే అతనికి ప్రత్యప కారం చేయాలి తప్ప ఉపకారం చేసి ప్రయోజనం లేదుకదా? అని విన్నవిస్తాడు బృహస్పతి బ్రహ్మతో.

"ఇత్థ మారాధ్యమానోపి క్లిశ్నాతి భువనత్రయమ్
శామ్యేత్ప్రత్య్య పకారేణ నోపకారేణ దుర్జనః'' (2.40).

దేవతల ప్రార్ధనవిని బ్రహ్మదేవుడు — 'నా వరాలవల్ల పైకివచ్చిన ఈ తారకుణ్ణినేనే నశింపచేయడం న్యాయంకాదు చేత్తో పెంచిన విషవృక్షాన్నైనా తన చేత్తోటే పెరికివేయడం న్యాయం కాదుకదా!'' అంటాడు.

"ఇతః సదైత్యః ప్రాప్తశ్రీర్నేత ఏ వార్హతి క్షయమ్
విషవృక్షోపి సంవర్ధ్య స్వయం చేత్తా మసాంప్రతమ్" (2.55).

శివునికి పార్వతియందు జన్మించిన కుమారుడు మాత్రమే ఆ అసురుణ్ణి చంప కలుగుతాడు. అందుచేత శివునికి పార్వతిపై అనురాగం కలిగే ప్రయత్నం చెయ్యండి అని ఉపదేశించి, వారిని పంపివేస్తాడు. దానికి తగినవ్యక్తి మన్మథుడే అన్న ఉద్దేశ్యంతో దేవేంద్రుడు ఆతన్ని స్మరించగాదే ఆతడు రతీవసన్తసమేతుడై ప్రత్యక్షమౌతాడు. ప్రస్తుతం అతనితో పని ఉండడంచేత "దేవేంద్రుని కళ్ళన్నీ ఒక్కమారుగా ఆ మన్మథునిమీదనే ప్రసరించాయట. అధికారులు ఏదోవిధంగా వారి ప్రయోజనాలను సాధించుకోవడంకోసమే ప్రయత్నిస్తారు. అందుచేత ఆయా ఆశ్రితులపై వారికి కలిగే అనుగ్రహం అస్థిరంగానే ఉంటుంది.''

"తస్మిన్ మఘోనస్త్రి దశాన్విహాయ సహస్రమక్షాం యుగపత్పపాత
ప్రయోజనాపేక్షితయా ప్రభుణాం ప్రాయశ్చలం గౌరవమాశ్రితేషు''(3.1)

తనపై దేవేంద్రుడు చూపించిన ఆదరాతిశయానికి ఉప్పొంగిపోయి మన్మ థుడు – 'నీకు ఏమి పని కావాలో చెప్పు; నాకు సాధ్యంకాని పనిఅంటూలేదు" అని అంటూ "నాకున్న ఆయుధాలల్లో పుష్పాలే అయినా నీదయవల్ల పినాకంచేత పట్టిన శివుణ్ణికూడా లొంగదీసే శక్తి నాకుంది'' అంటాడు.

"తవ ప్రసాదాత్కుసు మాయుధోపి సహాయమేకం మధుమే వలబ్ధ్వా.
కుర్యాం హరస్యాపి పినాకపాణేర్ధైర్యచ్యుతిం కేమమ ధన్వినోఽన్యే"
(3.10).

అంతవరకూ కాలిమీద కాలువేసికొని మన్మథుని మాటలు ఆలకిస్తున్న దేవేంద్రుడు తొడమీద ఉన్న రెండవకాలు పాదపీఠంమీద ఉంచి.

''అథోరుదీశాదవతార్య పాదమాక్రాన్ని సంభావిత పాదపీఠమ్
సంకల్పితార్థే వివృతాత్మశక్తి మాఖండలః కామమిదం బభాషే'' (3.11)

'ప్రస్తుతం నాకు కావలసినది అదే. శివునికి పార్వతిపై ప్రేమ కలిగేటట్లు చెయ్యి' అని చెప్పి పంపివేస్తాడు. ఆ కార్యాన్ని సాధించడానికి శివుడు తపస్సు చేసే ఆశ్రమం చేరుకుంటాడు మన్మథుడు. అతనికి సహాయంచేయడానికి వసంతుడు విజృంభించడంతో వృక్షాలన్నీ పుష్పిస్తాయి. కర్ణికారపుష్పం ఎంతో అందంగా ఉన్నా 'దీనికి సువాసన కూడా ఉంటే ఎంతబాగుంటుంది' అని అనిపిస్తుంది. బ్రహ్మసాధారణంగా అన్ని గుణాల్నీ ఒకచోట ఉంచడు కదా ?''.

''వర్ణప్రకర్షే సతికర్ణికారం దునోతి నిర్గంధతయాస్మ చేతః
ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః''
(3-28)

ఈ వసంతావిర్భావంతో పశుపక్ష్యాదుల్లోకూడా మన్మథ వికారాలు ఆవిర్భవించాయట. ''తుమ్మెద ప్రియురాలితోకలిసి ఒకే కుసుమపాత్రలో మధువును ఆస్వాదిస్తూన్నదట. స్పర్శ సుఖంచేత కళ్ళు మూసుకొని నిలబడిఉన్న ఆడలేడి వంటిమీద మగలేడి కొమ్ముతో గోకుతూందట.''

''మధుద్విరేఫః కుసుమైకపాత్రే పపౌ ప్రియాం స్వామనువర్తమానః
శృంగేణచ స్పర్శ నిమీలితాక్షీం మృగీ మకండూయత కృష్ణసారః''
(3-36)

ఆ ఆశ్రమంలో అత్యుత్సాహంతో, రతిద్వితీయుడుడై ధనుష్టంకారం చేసుకొంటూ మన్మథుడు ముందుకు సాగుతాడు. అంతలో ఎదుట సమాధి స్థితిలోఉన్న శివుడు కనబడతాడు. ఇక్కడ ఏడు శ్లోకాల్లో కాళిదాసుచేసిన శివసమాధిస్థిత శివవర్ణనం అత్యద్భుతమైనది. ఆతనికిగల యోగశాస్త్రాభ్యాస పరిచయాన్ని వ్యక్తీకరిస్తుంది. ఈ శ్లోకాలు చదువుతూ మననం చేసుకుంటే ధ్యానముద్రలోఉన్న పరమశివుడు మనకు కళ్లకు కట్టినట్టుగా ఉంటుంది. ఆ శివుణ్ణి చూడగానే మన్మథుని ఒళ్ళు జల్లుమంది. చేతిలోంచి ధనస్సు జారిపోయింది. ఇంతలో శివునికి పుష్పాలు సమర్పించడంకోసం వస్తూన్న అతిలోక సుందరియైన పార్వతి కొంతదూరంలో కనబడింది

ని దను చూడగానే మన్మథుని ప్రాణం లేచివచ్చింది. ఆమె సమీపించేసరికి శివుడు
్యానముద్రలోంచి బాహ్యదృష్టిలోనికి వచ్చాడు. ఆమె సమర్పిస్తూన్న పుష్పాలు
్కరిస్తూన్నాడు. ఇదీ సమయం అనుకొని మన్మథుడు బాణ ప్రయోగం చేస్తాడు.
నితో ఇదివరకు ఎన్నడూలేని మనోవికారం కలిగింది శివునికి. ఆయన నేత్రాలు
ర్వతీ ముఖంపై తొట్రుపడ్డాయి. వెంటనే సద్దుకుంటాడు శివుడు. దీనికి ఏదో
రణం ఉండిఉంటుంది. అని నలుమూలలా చూస్తాడు. ఒక మూల విల్లెక్కు పెట్టి
న్న మన్మథుడు కనిపిస్తాడు. మరుక్షణంలో తృతీయలోచనంలోంచి వచ్చిన
న్ని మన్మథుణ్ణి భస్మంచేస్తుంది. ఇంక స్త్రీ సన్నిధానం మంచిదికాదనుకొని శివుడు
రివారంగా అంతర్ధానం అయిపోతాడు. ఇదంతా కొద్ది క్షణాల్లో జరిగిపోయింది.
ి మూర్ఛపోయింది. ఈశ్వరునిపై ఎన్నో ఆశలు పెట్టుకొన్న పార్వతి తన
లన్నీ వమ్మైపోవడంతో శూన్యహృదయురాలై ఇల్లు చేరుకుంటుంది. (చతుర్థ
ంలో) రతి మూర్ఛలోంచి తేరుకొని భర్తకై అతి కరుణంగా విలపిస్తుంది.
రికి ఒక అశరీరవాణి 'శివుడు పార్వతిని వివాహమాడిన పిమ్మట నా భర్త
నరుజ్జీవితుడౌతాడు'' అని చెప్పడంతో ఆమె ఊరడిల్లుతుంది.

కేవల సౌందర్యంచేత శివుని మనస్సును ఆవర్జింప చేసుకోవడం అశక్యమనే
యాన్ని గ్రహించిన పార్వతి తపస్సుచే తన కోరిక సాధించాలని నిశ్చయించు
ంటుంది. తండ్రిగారి అనుమతిపొంది, కాలాంతరంలో తన పేరుతో ప్రసిద్ధి
ందిన గౌరీ శిఖరంమీద తపస్సుచేస్తూ ఉంటుంది. "ఘోర తపస్సు చేస్తూన్న
మను చూడడానికి ఎందరో మహామునులుకూడా వస్తూ ఉండేవారట. ధర్మ
ద్ధుల విషయంలో వారు వయస్సుచేత చిన్నవారా, పెద్దవారా అనే పట్టింపు
ఉదుకదా ?''

> ''కృతాభిషేకాం హుతజాతవేదం సం త్వగుత్తరా సంగవతీ మధీతిసీమ్
> దిదృక్షవస్తా మృషయోభ్యు పాగమన్న ధర్మవృద్ధేషువయః సమీక్ష్యతే''
> (5-16)

కొంతకాలం గడచిన తరవాత శివుడు ఈమెను పరీక్షించడంకోసం బ్రహ్మచారి
ంలో వస్తాడు. ఈమె శివునికోసం తపస్సు చేస్తున్నది అన్న విషయం తెలుసు
ఆ శివుణ్ణి ఎన్ని విధాల దూషించడానికి వీలుందో అన్నివిధాల దూషిస్తాడు.
రికి — ''అతన్ని నీవు వివాహం చేసుకోవాలని అనుకోవడం శ్మశానంలోఉన్న

మధ్య శూలానికి యూపస్తంభానికిచేసే వైదిక సంస్కారం చేయడం వంటిది'' అంటాడు.

''అపేక్ష్యతే సాధుజనేన వైదికే శ్మశాన శూలస్య నయూప సత్క్రియా''
(5-63)

ఈ శివదూషణం వినగానే పార్వతి మండిపడిపోతుంది. ''మహాత్ముల ఆచార్య వ్యవహారాదుల్లోఉన్న రహస్యం నీవంటి మూఢులకేం తెలుస్తుంది'' అంటుంది.

''అలోక సామాన్య మచింత్య హేతుకం ద్విషన్తి మందాశ్చరితం
మహాత్మనామ్'' (5-75)

''శివుని అలవాట్లన్నీ అమంగళకరములు అని అన్నావు! మంగళం ఎవరికి కావాలి? ఆపదలు తొలిగిపోవాలనుకొనేవాళ్లకే ఏవేవో కోరికలు సఫలం కావాలనుకునేవాళ్ళకే కావాలి. అందరి ఆపదలనీ తొలగించి రక్షించేవాడూ, కోరికలు లేనివాడూ అయిన శివునికి మంగళం ఎందుకు?'' అని ప్రశ్నిస్తుంది.

''విపత్ప్రతీకారపరేణ మంగలం నిషేవ్యతే భూతిసముత్సుకేనవా
జగచ్ఛరణ్యస్య నిరాశిషఃసతః కిమేభిరాశోపహతాత్మవృత్తిభిః'' (5-76)

''పోనీ; నీవీ శివుణ్ణిగూర్చి ఏ విధంగా విన్నావో అదంతా నిజమే అనుకో. నాకు మాత్రం ఈయనమీద స్థిరమైన ప్రేమఉంది. ఒక వ్యక్తిమీద ప్రేమ ఏర్పడిందంటే ఆ ప్రేమించేవారికి ఆ వ్యక్తియొక్క గుణదోషాలతో పనిలేదు'' అంటుంది.

''అలం వివాదేన యథాశ్రుతస్త్వయా తథావిధస్తావద శేషమస్తుసః
మమాత్ర భావైకరసం మనః స్థితం నకామవృత్తిర్వచనీయ మీక్షతే''
(5-82)

ఇదంతా విని ఆ కుహనా బ్రహ్మచారి ఇంకా ఏమో చెప్పబోయాడు. అది చూచి పార్వతి పక్కనున్న చెలికత్తెతో - ''ఇంకా ఏదో చెప్పాలని ఇతడు నోరు మెదుపుతున్నాడు. 'ఇతన్ని వారించు. మహాత్ముల్ని దూషించేవారికి ఎంత పాపమో ఆ దూషణ విన్నవాళ్ళకుకూడా అంతే పాపం'' అంటుంది.

''నివార్యతామాళి కిమప్యయం వటుః పునర్వివక్షుః స్ఫురితోత్తరాధరః
నకేవలం యోమహతోప భాషతే శృణోతి తస్మాదపియః సపాపభాక్''
(5-83)

'లేదా నేనే ఇక్కడినుంచి లేచిపోతాను' అని అంటూ ఆమె వెళ్ళిపోబోయింది. అంతలో శివుడు నిజస్వరూపందాల్చి "నన్ను నీ తపస్సుతో కొనుక్కొన్నావు. ఈనాడు మొదలు నేను నీకు దాసుణ్ణి" అని అంటూ చేయిపట్టుకొంటాడు. దానితో ఆమె తానుపడ్డ శ్రమ అంతా మరచిపోయిందట. నిజమే! పడ్డశ్రమకు ఫలితం లభించగానే మనిషి మళ్ళీ కొత్త మనిషి ఐపోతాడు."

"అద్య ప్రభృత్య వనతాంగి తవాస్మిదాసః
క్రీతస్తపోభిరితివాదిని చంద్రమౌలే
అహ్నాయసా నియమజం క్షమముత్స సర్జ
క్లేషః ఫలేన హి పునర్నవతాం విధత్తే." (5-86)

'నన్ను నీ కిచ్చి వివాహం చేయవలసిందిగా మా తండ్రిగారిని ప్రార్థించు' అని పార్వతి చెప్పినమాట ప్రకారం శివుడు ఆ పనిపై పంపడంకోసం సమర్థుల్ని స్మరిస్తాడు. వెంటనే వారూ వస్తారు. "వారి నందరినీ గౌరవభావంతో చూస్తూ శివుడు వారితోవచ్చిన అరుంధతికికూడా సమానమైన గౌరవం ఇస్తాడు. ఎందుచేత నంటే మహాత్ములు ఇతరులకు గౌరవం ఇచ్చేది వారి చరితమును పట్టేకాని, వారిలో ఉన్న స్త్రీ పురుషత్వాదులను పట్టికాదు."

"తామగౌరవ భేదేన మునీం శ్చాపశ్యదీశ్వరః
స్త్రీ ప్రమానిత్య నాస్థైషా వృత్తంహి మహితం సతామ్" (6-12)

మహేశ్వరు డంతటివాడు తమను స్మరించడం అనేది తమకు ఎంతో గౌరవ ప్రదమైన విషయం అని శివునితో విన్నవిస్తూ సప్తర్షులు 'పెద్దవాళ్ళు ఆదరాన్ని చూపించడాన్నిపట్టి ఎవరిమట్టుకు వారికి తమతమ గుణములపై విశ్వాసం కలుగుతుందికదా?" అని అంటారు.

"త్వత్సంభావిత మాత్మానం బహుమన్యామహే వయమ్
ప్రాయః ప్రత్యయ మాధత్తే స్వగుణేషూత్త మాదరః" (6.20)

వసిష్ఠ మహర్షి ప్రక్కనున్న అరుంధతిని చూడడంతో శివునికి వివాహాభిలాష అధికమైనదట. ఎందుచేతనంటే - ఏ ధర్మకార్యం చేయాలన్నా ధర్మపత్నియేకదా మూలకారణం?"

"తద్దర్శనాద భూచ్ఛంభోర్భూయాన్ దారార్థమాదరః.
క్రియాణాం ఖలుధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణమ్" (6-13)

శివుడు సప్తర్షులతో 'మీవంటి పెద్దలు నిశ్చయించిన వివాహ సంబంధాలు ఏలోటూ లేకుండా ఉంటాయి కాబట్టి మిమ్మల్ని ఈ విషయంలో సహాయం చేయవలసిందిగా కోరుతున్నాను' అంటాడు.

''తామస్మదర్థే యుష్మాభిచితవ్యో హిమాలయః
విక్రియాయై నకల్పన్తే సంబంధాః సదనుష్ఠితాః.'' (6-29)

వివాహ విషయాల్లో ఆడవారికి ఎక్కువ అనుభవం ఉంటుంది కాబట్టి అరుంధతి కూడా ఈ విషయంలో సహాయం చేయాలని కోరుతాడు.

''ఆర్యాప్యరుంధతీ తత్ర వ్యాపారం కర్తుమర్హతి
ప్రాయేణైవంవిదే కార్యే పురంధ్రీణాం ప్రగల్భతా'' (6-32)

సప్తర్షులు హిమవంతుని నగరమైన ఓషధిప్రస్థం చేరారు. ఆ పట్టణం అలకాపట్టణాన్ని మించిన ఐశ్వర్యంతో, స్వర్గంలోఉన్న జనాభా పెరిగిపోవడంచేత, కొంత జనాన్ని తరలించి వారికోసమై నిర్మించిన క్రొత్త శాఖానగరంలా ఉందట. ఇలా చేసిన నూతన నగర నిర్మాణానికి 'అభిష్యందవ మానము' అని పేరు.

''అలకామతి వాహ్యైవ వసతిం వసుసంపదామ్
స్వర్గాభిష్యంద వమనం కృత్వేవోప నివేశితమ్'' (6-37)

హిమవంతుడు వారిని తగురీతిగా సత్కరిస్తాడు. వారు తాము వచ్చిన ప్రయోజనాన్ని తెలుపుతూ ''అర్థాన్ని శబ్దంతో కూర్చినట్లుగా ఆ శివుణ్ణి పార్వతిలో (అవినాభావ సంబంధం ఉండేటట్లుగా) కూర్చాము. మంచి భర్తచేతిలో ఉంచిన కుమార్తెను గూర్చి తండ్రికేమీ విచారము ఉండదుకదా ?'' అంటారు.

"తమర్థమివ భారత్యా సుతయా యోక్తు మర్హసి
అశోఖ్యాహి పితుః కన్యా సద్భర్త్ర ప్రతిపాదితాః (6 79).

ఈ పెళ్ళి మాటలు జరుగుతూండగా తండ్రి ప్రక్కనే కూర్చున్న పార్వతి తలవంచుకొని చేతిలోఉన్న పద్మం రేకులు లెక్కపెడుతుందట

"ఏవం వాదిని దేవర్షౌ పితురధోముఖీ
లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ" (6.84).

హిమావంతునికి తన కుమార్తెను శివునికి ఇవ్వడం సర్వథా సమ్మతమే. అయినా కన్యా వివాహాదుల విషయంలో గృహస్థులు తమ భార్యల అభిమతం ప్రకారమే నడవవలసి ఉండడంచేత, తన భార్యవైపు చూచినాడట.

"శైలః సంపూర్ణకామోపి మేనాముఖము దైక్షత
ప్రాయేణగృహిణే నేత్రాః కన్యార్థేషు కుటుంబినః" (6.85).

ఆమెకూడా అంగీకరించడంతో వెంటనే ముహూర్త నిశ్చయం అయింది. ముహూర్తం రోజున వధువుకు మంగళస్నానాదులు చేయించి ముత్తైదువలు అలంకరణం చేశారు. శివుడు సపరివారంగా వివాహానికై తరలివస్తున్నాడు. దేవతలందరూ ఒక రొకక్కరేవచ్చి చేరుకుంటున్నారు. ఆ నందీశ్వరుడు చూపగా ఆ దేవతలందరూ వినీతవేషాలతో శివునికి నమస్కరించారు. ''బ్రహ్మనుచూచి శివుడు వచ్చావా అన్నట్లు తల ఊపాడు. విష్ణువుతో నాలుగుమాటలు మాట్లాడాడు. ఇంద్రుణ్ణిచూచి ఒక చిరునవ్వు నవ్వాడు. ఇతర దేవతలందరి వైపూ ఒకసారి చూచాడు.

"కంపేన మూర్ధ్నః శత పత్రయోనిం వాచాహరిం వృత్రహణం స్మితేన
ఆలోకమాత్రేణ సురానశేషాన్ సంభావయామాస యథాప్రధానమ్"
(7.46)

ఐతే ''బహ్మవిష్ణు శివుల్లో ఉన్న ఈ తారతమ్యం వాస్తవంకాదు; ఒక్క మూర్తియే మూడువిధాలుగా విభక్తమైంది. ఒకప్పుడు శివుడు ప్రధానుడుగానూ మిగిలినవారు అప్రధానాలుగానూ, ఒకప్పుడు విష్ణువు ప్రధానుడుగానూ మిగిలిన ఇద్దరూ అప్రధానులుగానూ, మరొకప్పుడు బ్రహ్మ ప్రధానుడుగానో శివకేశవులు అప్రధానులుగానూ ప్రవర్తిస్తూ ఉండవచ్చు'' అని చెపుతూ కాళిదాసు ఆయా దేవతల తారతమ్యాన్ని గూర్చి మనం కలహించుకోవలసిన పనిలేదని చక్కగా బోధిస్తాడు.

''ఏకైవ మూర్తిర్విభిదే త్రిధా సా సామాన్యమేషాం ప్రథమావరత్వమ్
విష్ణోర్హరస్తస్యహరిః కదా ద్వేధాస్తావపి ధాతురాద్యౌ" (7.44)

పార్వతీ పరమేశ్వరుల వివాహం అవుతుంది. రెండువేల సంవత్సరాలక్రితం కాళిదాసు వర్ణించిన ఈ వివాహపద్ధతియే ఈనాడుకూడా భారతీయుల్లో ప్రచారంలో ఉంది. నవవధూవరులు ఊరేగుతున్నప్పుడు వారిని చూడాలనే ఔత్సుక్యంతో ప్రాసాద గవాక్షాలదగ్గర గుమిగూడిన యువతుల చేష్టలూ వారి సంభాషణా అత్యద్భుతంగా వర్ణింపబడ్డాయి. ఈ వివాహఘట్టాన్నంతా కాళిదాసు మళ్లీ ఇందుమతీ అజవివాహ సందర్భంలో యథాతథంగా ప్రవేశపెట్టినాడంటే దీన్నిపట్టి ఆయనకూ గృహస్థ

జీవనంమీదా దానికి సంబంధించిన వినోదోత్సాహాల మీదఉన్న ఆస్థి ఎంతటి
తెలుస్తుంది. ఈ వివాహం అయిన తరువాత ఆకాశవాణి చెప్పిన విధంగా మ
థుడు పునరుజ్జీవితుడయ్యాడు. ఇపుడు మన్మథుడు తనపై బాణప్రయోగం చేసి
ఏమీ అభ్యంతరంలేదని శివుడు అనుమతించాడు. తత్ఫలితంగా పార్వతీ పరమే
రులు చేసిన వివిధ భోగాలవర్ణన ఎనిమిదవ సర్గలో చేయబడింది.

**మేఘ దూతము :** ఉత్తమకావ్యాన్ని చదివి ఆస్వాదించడానికి కొ
పద్ధతులున్నాయి. ఏదో ఒక పురాణంచదివినట్లు శీఘ్రంగా చదవినా, నవల, క
మొదలైనవి చదివినట్లు మౌనపఠనం (Silent reading) చేసినా ఆ కావ్యంలో
సౌందర్యాన్ని ఆస్వాదించలేము. మధురమైన పదార్థాన్ని కొంచెం కొంచెం అ
గిస్తూ దానిలోని రుచిని ఆస్వాదించినట్లుగా కవితా సౌందర్యాన్ని ఆస్వాదించడాని
ప్రయత్నించాలి. కాదంబరివంటి గద్యకావ్యాలైనా, తదితరాలైన పద్యకావ్యాలై
ఈ విధంగానే చదివి ఆనందించాలి. History of the Decline and fall
The Roman Empire' అనే గద్యచరిత్రకావ్యం వ్రాసిన గిబ్బన్ కవి ఈ గ్రంథ
వ్రాసినపుడు ఒక్కొక్క వాక్యం వ్రాసి, తరువాత ఆ వాక్యం నాలుగైదుసా
చదువుకొని అది చెవికి ఏమాత్రం ఇంపుగా లేదని తోచినా దాన్ని కొట్టేసి మ
వాక్యం వ్రాసేవాడట. గద్యకావ్యం విషయమే ఇలా ఉన్నట్లైయితే పద్యకావ్య
విషయములోనూ, ముఖ్యంగా మందాక్రాంతంవంటి బరువైన ఒకే వృత్తం
వ్రాసిన మేఘసందేశంవంటి భావప్రధానమైన కావ్యం విషయంలోనూ వేరు
చెప్పనక్కరలేదు ఇందులోని ప్రతి ఒక్క శ్లోకమూ ఒక రసగుళిక. దాని
ముందుగా పైకి చదువుకొని శబ్దగుంఫనా, అర్థగాంభీర్యమూ, రసనిర్వహణా మొ
లైన విషయాలన్నీ జాగర్తగా పరిశీలించి ఆస్వాదించాలి. అంతే కాని గ్రంథసమీ
వ్రాసేవాడల్లా ఒక గుక్కలో 120 శ్లోకాలూ చదివేసి, ఒకేవృత్తం ఉపయోగిం
డంచేత కొంచెం మోనాటనస్‌గా ఉంది అనడం సహృదయత్వానికి పరిచాయక
కాజాలదు.

"కుబేరుని శాపంవల్ల కలిగిన ప్రియావిరహంతో బాధపడుతూన్న ఒ
యక్షుడు రామగిర్యాశ్రమంలో (మధ్యప్రదేశ ప్రాంతంలోని రామటేక్; ఉత్త
ప్రదేశంలోని చిత్రకూటం కాదు) కాలక్షేపం చేస్తూఉంటాడు," అన్న వస్తుని
శంతో ఈ కావ్యం ప్రారంభం అవుతుంది. ఆషాఢ ప్రథమదివసాన పర్వతశి
రంపై వ్రేలాడుచున్న మేఘున్ని చూడ్డంతో విరహబాధ ఎక్కువై తనవ

ప్రియురాలుకూడా విరహంలో బాధపడుతుంటుంది కాబట్టి ఆమెకు తన క్షేమవార్త పంపి ఊరడించాలనే అభిప్రాయం కలిగింది ఆతనికి ఆపని చేయడానికి కూడా ఆమేఘుణ్ణే ప్రార్థించాలని నిర్ణయించుకొని ఆతని ఆభిముఖ్యం సంపాదించుకోవడం కోసం పుష్పాలతో పూజించి, ఆతని అభిజాత్యాదులను స్తుతిస్తాడు అలకాపట్టణంలో ఉన్న తన భార్యకొక సందేశం అందచేయమని ప్రార్థిస్తాడు. ''ఆమె నీకు వదిన వంటిది. నా రాకకై రోజులు లెక్కపెట్టుకొంటూ ఉండే ఆమెను నువ్వు తప్ప కుండా చూడకలుగుతావు. స్త్రీల హృదయం పుష్పంవలె బాలసుకుమారమైనదే. అయినా ఆశ అనే తొడిమి దాన్ని రాలిపోకుండా గట్టిగా పట్టుకొని ఉంటుంది''; అంటాడు.

''తాం చావశ్యం దివసగణనా తత్పరా మేక పత్నీం
మవ్యాపన్నా మవిహతగతిర్ద్రక్ష్యసి భ్రాతృజాయామ్
ఆశాబన్ధః కుసుమసదృశః ప్రాయశోహ్యంగనానాం
సద్యఃపాతి ప్రణయం విప్రయోగే రుణద్ధి" (1-9)

ఈ విధంగా ముందు ప్రార్థించి రామగిరినుంచి అలకాపట్టణం చేరవలసిన మార్గం సవిస్తరంగా వర్ణించిచెపుతూ ఆ మార్గమధ్యంలో ఏయే విచిత్రవిషయాలు కనబడితాయో, మేఘుడు ఎక్కడ ఏవిధంగా ఆనందం అనుభవిస్తూ మార్గశ్రమ తెలియకుండా ప్రయాణం చేయాలో చెపుతాడు. మేఘుడు అలకాపట్టణం చేరే లోపుగా, పర్వతాలైతేనేం, నదులైతేనేం, దేశాలైతేనేం మొత్తం ఇరవైనాలుగింటిని వర్ణించాడు కాళిదాసు. ఈ వర్ణనం మరొక కవిచేతిలో పడిఉన్నట్లైతే రసవిహీన మైన జాబితాగా ఉండేది. కాళిదాసు ప్రతీదానియందూ ఏదో ఒక అపూర్వ సౌందర్యాన్ని చూపిస్తూ అతిమనోహరంగా వర్ణించాడు. సస్యసమృద్ధికి హేతు భూతుడైన మేఘునికోసం ఎదురుచూస్తున్న స్త్రీలుగల జనపదాలూ, గూళ్ళుకట్టు కొనే కాకులతో నిండిన గ్రామచైత్యాలు వర్షం కురవగానే పులకరించినట్లుగా చెట్లు చేమలతో నిండిన పర్వతాలూ, పరవళ్లు తొక్కుతో ప్రవహించే నదులూ, ఇలా ఎన్నో ప్రాకృతిక దృశ్యాలు స్వాభావికంగానూ, మానవధర్మరూపణంతోకూడా మన కళ్లకు కట్టినట్లుగా వర్ణిస్తాడు. ఉజ్జయిని మేఘుడు ప్రయాణంచేసే దారిలో లేదు. ఐనాకూడా తన నివాసనగరం మేఘునికి తప్పకుండా చూపించాలనే ఉద్దే శంతో కాళిదాసు ఆ మేఘుణ్ణి అక్కడికికూడా పంపుతాడు. మెరుపులుచూచి భయ పడిన ఆ ఉజ్జయినీ కాంతామణుల నేత్రాంతాలతో ఆడుకోకపోతే మేఘుని జన్మవ్యర్థం అవుతుందట.

''వక్రఃపన్థాయదపి భవతః ప్రస్థితస్యోత్తరాశాం
సౌధోత్సంగ ప్రణయవిముఖో మాస్మభూరుజ్జయిన్యాః
విద్యుద్దా మస్ఫురిత చకితైస్తత్ర పౌరాంగనానాం
లోలాపాంగైర్యది నరమసే లోచనైర్వంచితోஉసి''                (1-2

''సంధ్యాకాలంకంటె ముందుగానే ఉజ్జయినిలోఉన్న మహా కాళేశ్వర
సన్నిధి చేరుకున్నా సంధ్యాకాలంవరకూ మాత్రం అక్కడే ఉండు. సంధ్యా పూ
సమయంలో నీ ఉరుములతో పటహధ్వని కల్పించినట్లైతే, అలాంటి మధుర
తాలు నీకు ఉన్నందుకు సాఫల్యం లభిస్తుంది'' అంటాడు యక్షుడు. ఈశ్వరు
సేవించే అవకాశం లభించినపుడు విడువకూడదు కదా మరి ?

''అప్యన్యస్మిన్ జలధర మహాకాల మాసాద్యకాలే
స్థాతవ్యంతే నయన విషయం యావదత్యేతిభానుః
కుర్వన్ సంధ్యా బలిపటహతాం శూలినః శ్లాఘనీయా
మామన్ద్రాణాం ఫలమవికలం లప్స్యసే గర్జితానామ్''                (1-3

''రాత్రివేళ సూదులతో గుచ్చేటంత దట్టంగాఉన్న చీకట్లో అభిసారిక
తమ ప్రియుల ఇండ్లకు వెడుతూఉంటారు. మెరుపులతో వాళ్లకు మార్గం చూపిం
అంతేకాని వర్షం కురిసి ఉరమకు. వాళ్లు అసలే భయస్వభావం కలవారు.''

''గచ్ఛన్తీనాం రమణ వసతిం యోషితాం తత్రవక్తం
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యైస్తమోభిః
సౌదామన్యా కనకనికష స్నిగ్ధయా దర్శయోర్వీం
తోయోత్సర్గ స్తనితముఖరో మాస్మ భూర్విక్లవాస్తాః.''                (1-4

''అక్కడినుంచి మెల్లిమెల్లిగా ప్రయాణం సాగిస్తూ మహేశ్వరుని మూర్తీభవిం
అట్టహాసంపలెఉన్న కైలాసం చేరుకో. ఆ కైలాస ప్రాంతంలోనేఉంది అల
పట్టణం. ఆ పట్టణంలో కుబేరుని గృహానికి ఉత్తరంగా మా గృహం ఉంటుం
ఇంద్రధనుస్సువలె ప్రకాశిస్తూన్న తోరణాన్నిబట్టి మా యింటిని దూరంనుండే గు
పట్టవచ్చు. దాని ఎదట ఒక బాలమందార వృక్షం ఉంటుంది.'' అంటూ ఇం
ఏవేవో గుర్తులు చెపుతాడు. తరువాత యక్షుడు భార్యకుపంపిన సందేశంకూ
ఈలాంటి సందేశాలన్నింటిలోకీ అత్యుత్తమమైనదని చెప్పాలి. ఆమెను స్వప్నం
నైనా చూద్దామంటే నిద్రే రావడంలేదట. చిత్తరువువ్రాసి చూద్దామంటే కన్నీ

నిండిపోవడంతో చూడలేకుండా ఉన్నాడట. అందుచేత ఏదో విధంగా ఈ గడువు పూర్తిఅయేవరకూ సహించడం ఒకటే మార్గం. "ఈ ప్రపంచంలో పూర్తిగా సుఖం మాత్రమే అనుభవించినవాడూ, పూర్తిగా దుఃఖాన్ని మాత్రమే అనుభవించిన వాడూ ఎవరున్నారు? మానవులదశ చక్రాంతంవలె క్రిందికీ మీదికీ తిరుగుతూ ఉంటుంది. అందుచేత నన్ను నేనే కుదుటపెట్టుకొంటున్నట్లుగా నీవుకూడా కుదుట పెట్టుకొని కాలక్షేపం చెయ్యి" అని సందేశం పంపుతాడు.

"నన్వాత్మానం బహుగణయ న్నాత్మనైవా వలంబే
తత్కల్యాణి త్వమపినితరాం మాగమః కాతరత్వమ్
కస్యైకాన్తం సుఖముపనతం దుఃఖమేకాన్తతో వా
నీ చైర్గచ్ఛత్యుపరిచ దశా చక్రనే మిక్రమేణ." (2-52)

మనుష్యులు ఒకరికొకరు దూరం అవడంతోటీ స్నేహం సన్నగిలుతోందని అంటారు. అది ఇతరుల విషయంలో వాస్తవం అయితే కావచ్చునేమోకాని అత్యంత ప్రేమాస్పదులైన దంపత్యాదుల విషయంలో ఆ ప్రేమ రోజురోజుకూ పేరుకొని పోయి ప్రేమరాశిగా ఏర్పడుతుందట.

"స్నేహానాహుః కిమపి విరహే ధ్వంసినః తేత్వభోగా
దిష్టేవస్తు న్యుపచితరసాః ప్రేమరాశీ భవన్తి" (2-55)

ఈ విధంగా అత్యద్భుతాలైన వర్ణనలతోటీ, హృదయాన్ని ద్రవింపచేసే రస పరి పుష్టితోటే నిండిఉన్న ఈ కావ్యం కాళిదాసు రచనలన్నింటిలోకీ బహుళ ప్రచారాన్ని పొందిందంటే ఆశ్చర్యం లేదు.

**రఘువంశము** : ఈ కావ్యాన్ని పార్వతీ పరమేశ్వరుల వందనంతో ప్రారం భించి కాళిదాసు తన వినయాన్ని చూపిస్తాడు. తగు సామర్థ్యం లేకపోయినా కవి ననిపించుకోవాలనే ఆశతో ఈలాంటి రచన చేయడంకోసం ఉద్యమిస్తూన్న తనను చూచి, పొడవైనవాడు అందుకోవలసిన, చెట్టుకొమ్మపైఉన్న పండుకోసం మరుగుజ్జు చేయిచాపుతే చూచి నవ్వినట్లుగా అందరూ నవ్వుతారట.

"మందః కవియశః ప్రార్థీగమిష్యా మ్యుపహాస్యతామ్
ప్రాంశులభ్యే ఫలేలోభా దుద్బాహురివ వామనః" (1-3)

ఇది ఎంతో లోకానుభవం, విజ్ఞానమూ సంపాదించుకొన్నవానికి మాత్రమే ఉండే మానసికస్థితి. ఐనా ప్రాచీనులైన వాల్మీక్యాదులు అనుసరించిన మార్గాన్నే అనుస

రిస్తూ రఘువంశరాజుల చరిత్ర వ్రాస్తానని అంటూ ముందుగా రాజుల గుణగణాల్ని వర్ణించి భారతీయుల ఉత్తమాదర్శాల్ని సూచిస్తాడు.

> ''సోహమా జన్మశుద్ధానా మాఫలోదయ కర్మణామ్
> ఆసముద్ర క్షితీశానా మానాక రథవర్త్మనామ్.''
>
> ''యథావిధి హుతాగ్నీనాం యథాకామార్చి తార్థినామ్
> యథాపరాధ దండానాం యథాకాల ప్రబోధినామ్.''
>
> ''త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్
> యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్.''
>
> ''శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్
> వార్ధకే మునివృత్తీనాం యోగేనాన్తే తనుత్యజామ్.'' (I. 5-8)

రఘువంశీయులు 1. జన్మనుండీ పరిశుద్ధులు 2. ఫలం లభించేవరకూ ప్రారంభించిన పని విడవనివారు. 3. సముద్రాంతమువరకుగల భూమికి అధిపతులు. 4. స్వర్గము వరకూ వెళ్ళే రథాలు కలవారు. 5. యథాశాస్త్రంగా హోమాదులు చేసేవారు. 6. కోరిక తీరేటట్లుగా యాచకుల్ని పూజించేవారు. 7. చేసిన తప్పుకు తగినంతగానే దండించేవారు. 8. కాలానుగుణంగా అప్రమత్తతతో ఉండేవారు. 9. దానం చేయడంకొరకై ధనసంపాదన చేసేవారు. 10. సత్యంకొరకై మితంగా మాటలాడేవారు. 11. కీర్తికోసం మాత్రమే దిగ్విజయం చేసేవారు. 12. సంతానం కొరకై గృహస్థాశ్రమంలో ఉండేవారు. 13. బాల్యంలో విద్యాభ్యాసం చేసేవారు. 14. యౌవనంలో భోగాలు అనుభవించేవారు. 15. చివరకు యోగాభ్యాసంచేత తనువులు చాలించేవారు. కాళిదాసు తాను రాయబోయే కావ్యానికి విషయసూచికవలె ఈ విషయాలన్నీ కావ్య ప్రారంభంలోనే చెప్పి వీటి ఉదాహరణలు ప్రధానంగా రఘుమహారాజు చరిత్రలోనూ, కొన్ని ఆ యా రాజుల చరిత్రలోనూ చూపించినాడు.

1. రఘువు సుదక్షిణా దిలీపుల తపఃఫలితంగా నందినీ ప్రసాదంవల్ల జన్మించినాడు. అందుచేత ఆజన్మశుద్ధుడు. అట్లే రామాదులుకూడా.
2. దిలీపుని అశ్వమేధాశ్వాన్ని రక్షించడానికికూడా వెళ్ళిన రఘువు దేవేంద్రునితో యుద్ధంచేసి, ఏదోవిధంగా యాగఫలం దక్కేటట్టు చేసినాడు. అందుచేత ఆఫలోదయ కర్ముడు. దిలీప రామాదులలోకూడా ఈ గుణం ఉంది.

3. రఘువుదిగ్విజయంచేసి ఆ సముద్రక్షితీశుడై తన వంశంవారి నంద రినీ అట్లు చేసినాడు.

4. రఘువు రథానికి ఎక్కడా అడ్డం లేకపోవడంచేత కుబేరునిపై దండ యాత్ర చేయ సంకల్పించాడు.

5. రఘువు తదితరులుకూడా అనేక యజ్ఞాలు చేసినవారే.

6. తన దగ్గర చిల్లిగవ్వైనాలేని సమయంలో రఘువు కౌత్సుతుడికి 14 కోట్ల దీనారాలు ఇచ్చినాడు.

7. యథాపరాధ దండత్వ (8) యథాకాల ప్రబోధిత్వ (10) సత్యాయ మితభాషిత్వ (12) ప్రజాయై గృహమేధిత్వ (13) శైశవేభ్యస్త విద్యత్వ యౌవనే విషయైషిత్వములనే గుణాలు దిలీప-రఘు-రామాదు లందరిలోనూ ఉన్నాయి.

9. రఘువు సంపాదించిన ధనమంతా విశ్వజిద్యాగంలో దానం చేసి వేసినాడు.

10. రఘువు రాజులను జయించి వారిని మళ్ళీ వాళ్ళ వాళ్ళ రాజ్యాల్లో స్థాపించినాడు. అది అతనిలోని యశసే విజగీషుత్వానికి ఉదా హరణము.

11, 12. రఘువు వార్ధకమున సన్యసించి చివరకు యోగాభ్యాసంచేత తనువు చాలించినాడని అష్ట సర్గలో వర్ణింపబడింది. ఈ విధంగా వీటిలో కొన్ని లక్షణాలు ఇతర రాజులలోఉన్నా అన్ని లక్షణాలూ రఘు మహారాజునందు ఉండడంచేతనే ఈ కావ్యంలో ఆతనికి ప్రాధాన్యం ఇచ్చి కాళిదాసు దీనికి రఘువంశంఅనే పేరు పెట్టినాడు.

వైవస్వతమను వంశీయులైన ఈ (సూర్యవంశ) రాజులకథ దిలీపుని కథతో ప్రారంభం అవుతుంది. చాలా కాలంవరకూ సంతానంలేని ఈ రాజు అందుకు కారణ మేమో తెలుసుకోవాలనే అభిప్రాయంతో భార్యాసమేతంగా పరిమిత పరివారంతో వసిష్ఠాశ్రమానికి వెళ్ళుతూండగా పల్లెలలోని వృద్ధ గోపాలకులు అపుడే కాచిన నెయ్యివంటి పదార్థాలు ఉపాయనంగా తీసికొనివస్తారు. అని ఆదరంతో స్వీకరించిన తరువాత ఆ రాజు వాళ్ళతో ఏ విషయాలు మాట్లాడతాడు? ఏమీ మాటలాడకుండా

వెళ్ళిపోతే వాళ్ళు చిన్నపుచ్చుకోవచ్చు. అందుచేత దగ్గరఉన్న చెట్లు చూపించి వాటి పేరు ఏమిటి? అని అడుగుతూండేవాడట.

> ''హైయంగవీన మాదాయ ఘోషవృద్ధా నుపస్థితాన్
> నామధేయాని పృచ్ఛంతౌ వన్యానాం మార్గశాఖినామ్.'' (1-45)

''కామధేను శాపంచేత నీకు పుత్రులు కలగలేదు; నా వద్దఉన్న నందినీ ధేనువును సేవిస్తే పుత్రుడు జన్మిస్తాడు'' అని వసిష్ఠుడు చెప్పగా దిలీపుడు ఆ విధంగా నియమ పూర్వకంగా ఆ ధేనువును సేవించి, ఆమె చేసిన పరీక్షకుకూడా నిలిచి ఆమె అనుగ్రహంచేత రఘువును పుత్రుణ్ణిగా పొందుతాడు. రఘువు రాజ్యానికివచ్చి దిగ్విజయంచేసి ఆ వచ్చిన ధనం అంతా విశ్వజిద్యాగంలో దాన ధర్మాలకై వెచ్చించి ఇంట్లో మట్టిపాత్రలుమాత్రం మిగల్చుకుంటాడు. ఈతని దిగ్విజయాన్ని వర్ణించడం ద్వారా కాళిదాసు అటు పశ్చిమాన ఆక్సస్‌నది మొదలు తూర్పున అస్సాంవరకూ, ఉత్తరాన హిమాలయం మొదలు దక్షిణాన సముద్రతీరంవరకూ భారతదేశం అఖండ దేశమనే సత్యాన్ని ఉద్ఘోషించినాడు. యజ్ఞంచేసి రఘువు నిష్కించనుడై ఉండగా వరతంతు శిష్యుడైన కౌత్సుడు తన గురువుగారికి 14 కోట్ల బంగారు నాణాలు గురుదక్షిణగా ఇవ్వవలసివచ్చి ఆ సొమ్ము యాచించడానికై రఘువు దగ్గరకు వచ్చినాడు. తన దగ్గర అపుడేమీ ధనం లేకపోవడంచేత కుబేరునిపైకి దండెత్తివెళ్ళి ధనం తీసికొనివచ్చి ఇస్తానని రఘువు అంటాడు. ఆ సంగతి తెలియగానే కుబేరుడు ఆతని ధనాగారంలో సువర్ణవృష్టి కురిపిస్తాడు. ''ఈ ధనం అంతా నీకోసమే సంపాదించితిని కాబట్టి దీన్నంతా నువ్వే తీసికొని వెళ్ళాలని రఘుమహారాజూ, 14 కోట్లకంటెఎక్కువ చిల్లిగవ్వైనా నాకు వద్దని ఆ కౌత్సుకుడూ'' చాలా సేపు వివరిస్తూండగా చూచి ఆ సాకేత పురవాసులంతా ఆశ్చర్య చకితులైనారట.

> ''జనస్య సాకేత నివాసినస్తౌ ద్వావప్యభూతా మభినంద్యసత్త్వౌ
> గురుప్రదేయాధిక నిఃస్పృహార్థీ నృపోర్థికా మాదధికప్రదశ్చ.''

రఘువుకు అజుడనే పుత్రుడు జన్మిస్తాడు. విదర్భరాజు చెల్లెలైన ఇందుమతికి స్వయంవరానికై ఆహ్వానంరాగా రఘువు అజుణ్ణి పంపుతాడు. ఆరవ సర్గలోని ఈ స్వయంవర ఘట్టం చాలా అద్భుతమైనది. ఆ యా దేశాలనుండి వచ్చిన రాజకుమారులందరూ వరసగా ఉన్నతాసనాలమీద కూర్చున్నారు. ఇందుమతి చేతిలో పుష్పమాల ధరించి ఒక్కొక్క రాజకుమారుని దగ్గరకే వెడుతూన్నది. ఆమె

ఇంకా తన దగ్గరకు రానంతవరకూ ప్రతి ఒక్కడూ ఆమె తన్నే వరిస్తుందని ఆశతో, ప్రకాశవంతమైన ముఖంతో కూర్చున్నాడట. ఆమె తననుకూడా దాటి వెళ్ళిపోవడంతో ఆతని ముఖం వివర్ణపోయిందట. ఒక వ్యక్తి కాగడా చేతిలో పట్టుకుని, రాజవీధిలో నడుస్తూంటే ఆ కాగడాకి ఎదురుగాఉన్న భవనం కాంతిగా ఉంటుంది. కాగడా భవనాన్నిదాటి వెళ్ళిపోగానే పెద్ద చీకటి ఆ భవనాన్ని ఆక్ర మిస్తుంది. అల్లా ఉందట ఈ రాజకుమారుల పరిస్థితి.

"సంచారణీ దీపశిఖేవరాత్రే యంయంవ్యతీయాయ పతింవరాసా
నరేంద్రమార్గాట్ట ఇవ ప్రపేదే వివర్ణభావంసస భూమిపాలః'' (6.67)

ఈ ఉపమానమే కాళిదాసుకు 'దీపశిఖా కాళిదాసు'' అనే బిరుదాన్ని తెచ్చింది. ఇందుమతి అజుణ్ణి వరిస్తుంది. రఘువు అజునికి రాజ్యభారం వప్పచెప్పి సన్యా సంస్వీకరించి, కొంతకాలానికి శరీరం చాలిస్తాడు. ఒకనాడు ఇందుమతీ – అజ మహారాజులు ఉద్యానంలో విహరిస్తూండగా ఆకాశంనుండి ఒక పుష్పమాల వక్ష స్థలంపై పడడంచేత ఇందుమతి మరణిస్తుంది. ఆమె విరహంతో అజుడు విలి పిస్తాడు. అతన్ని ఊరడించడానికి వసిష్ఠుడు తాను స్వయంగా రాజాలక శిష్యుడి ద్వారా సందేశం పంపుతాడు. ప్రాణికి ''మరణం సహజమైన స్వభావమట; జీవించడమనేవి అస్వాభావికమట అందుచేత ఎంరవరకూ జీవిస్తే అంతవరకే లాభం అనుకోవాలట. ఇదీ కాళిదాసు ఈ ఘట్టంలో మనకు చెప్పే జీవితానికి సంబంధించిన సందేశం.

''మరణం ప్రకృతిః శరీరిణాం వికృతిర్జీవిత ముచ్యతే బుధైః
క్షణమప్యతిష్ఠతీ శ్వసన్య దిజన్తార్నను లాభవానసౌ'' (8.87)

అజుడు అతికష్టంమీద కొంతకాలం జీవించి, ఈ కుమారుడైన దశరథునికి రాజ్య భారం వప్పచెప్పి ప్రాయోపవేశ నదీపాతాలచేత శరీరం చాలిస్తాడు. కుమార సంభవంలో భర్తను కోల్పోయిన రతియొక్క విలాపాన్ని, ఈ కావ్యంలో భార్యను కోల్పోయిన అజుని విలాపాన్ని వర్ణించడంలో కాళిదాసు అభిప్రాయం ప్రాణికోటిలో అందరికీ ఇవి తప్పవనే విషయం సూచించడమే అయి ఉండాలి.

నవమసర్గ మొదలు పంచదశ సర్గవరకూ కాళిదాసు రామాయణగాథను అంతిసుందరంగానూ సంక్షిప్తంగానూ చెప్పినాడు.

సీతాపరిత్యాగ ఘట్టంలో లక్ష్మణుడు సీతను అడవికి తీసికొనిపోయి అక్కడ రాముని ఆజ్ఞను ఆమెకు తెలియపరుస్తాడు. ఆమె మూర్ఛపోయి తేరుకొని - అత్తగార్లకి నా నమస్కారాలు అందచెయ్యి' అనిచెప్పి "ఆ రామునితోకూడా, అగ్నిశుద్ధురాలనే విషయం తెలిసికూడా నీవు ఇలా చేయడం నీ కులమర్యాదకీ, నీ శాస్త్రజ్ఞానానికీ తగినదేనా; అని అన్నానని చెప్పు'' అంటుంది.

''వాచ్యస్త్వయా మద్వచనాత్సరాజా వహ్నౌ విశుద్ధామపి యత్సమక్షమ్
మాంలోకవాద శ్రవణా దహాసీః శ్రుతస్యకిం తత్సదృశం కులస్య"

ఇక్కడ 'రామునితో చెప్పు' ''నా భర్తతో చెప్పు'' అని అనకుండా 'ఆ రాజుతో చెప్పు' అనడంలో ఉన్న సౌందర్యం వర్ణనాతీతం. ఈ ఘట్టం అంతా ఈ విధంగా కరుణరసప్లావితం అయి ఉంది

రామచరిత్ర తరువాత కుశుని చరిత్ర నాతివిస్తృతంగా వర్ణించి కాళిదాసు తరువాతిరాజుల చరిత్రను అతి సంక్షిప్తంగానూ, కొందరి విషయంలో నామనిర్దేశం మాత్రం చేస్తూ ముగిస్తాడు. తాను మొదట చెప్పిన గుణాలు లేకపోతే రాజు ఎలా పతితుడౌతాడో అన్న విషయంకూడా చెప్పడంకోసమా అన్నట్లు చివరకు విషయలంపటుడైన అగ్నివర్ణుని చరిత్రనూ, నింద్యమైన అతని అవసానాన్ని వర్ణిస్తాడు. వాస్తవానికి ఈ కావ్యం హటాత్తుగా ఆగిపోయిందనీ, దీనికి కారణం కాళిదాసు మరణం కావచ్చుననీ కొందరి అభిప్రాయం. ఏమైనా ఈ కావ్యం కాళిదాసు పరిపూర్ణమైన మానసిక పరిమిత పొందినపిమ్మట వ్రాసిన కావ్యం అనడంలో మాత్రము ఏమీ సందేహం లేదు.

**మాలవికాగ్నిమిత్రము :** ఈ నాటక ప్రారంభంలోనే కాళిదాసు - ఎందరో ప్రాచీనకవుల రచనలు ఉంటూండగా ఆధునిక కవియైన కాళిదాసు వ్రాసిన నాటకం ఎందుకు ప్రయోగించాలి అని నటుడిచేత ప్రశ్నవేయించి. - ప్రాచీనమైనంత మాత్రంచేత కావ్యం మంచిది కాదు, నవీనమైనంత మాత్రంచేత చెడ్డది కాదు. తెలివైనవాడు రెండింటినీ పరీక్షించి మంచిదాన్ని స్వీకరించాలి; అలా చేయనివాడు మూఢుడే అని సూత్రధారునిచేత సమాధానం ఇప్పిస్తాడు.

"పురాణమిత్యేవ నసాధు సర్వం నచాపి కావ్యం నవమిత్యవద్యమే
సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే మూఢః పరప్రత్యయనీయబుద్ధిః'' (1-2)

నాటినుండి నేటివరకూ ఈ శ్లోకం ఎందరో నవీన రచయితలకు ఉత్సాహవర్ధకంగా ఉంది.

అగ్నిమిత్రుణ్ణి వివాహమాడవలసిన మాళవిక అనే ఒక రాజకుమారి దురదృష్ట వశంచేత, ఆతని అంతఃపురంలోనే రాణియైన ధారణికి పరిచారికగా మారు వేషంలో ఉంటుంది. అక్కడే పరివ్రాజక వేషంలో ఉన్న మరొక వృద్ధ పండితురాలు మాళవిక తండ్రి మంత్రికి సోదరి. అతిలోకసుందరియైన ఈ మాళవిక రాజుకంటపడితే ఏం ప్రమాదమో అని ధారణి అమెను వేయికళ్ళతో కాపాడుకొంటూ గణదాసు అనే నాట్యచార్యుని దగ్గర ఆమెకు నాట్యం నేర్పిస్తూ ఉంటుంది, రాజుగారి రెండవ భార్యయైన ఐరావతి హరదత్తుని దగ్గర నాట్యం అభ్యసిస్తూ ఉంటుంది. రాజు ఒకనాడు మాళవిక చిత్తరువు చూస్తాడు. ఆనాటినుంచీ ఆమెను ప్రత్యక్షంగా చూడాలని ప్రయత్నిస్తాడు. అందుకు ఉపాయంగా విదూషకుడు ఆ నాట్యాచార్యుల మధ్య పోటీపెట్టి వారి తారతమ్యపరీక్షకై వాళ్ళ శిష్యురాండ్రచే నాట్యంచేయించాలని నిర్ణయింపచేస్తాడు. ఆవిధంగా రాజు నాట్యపరీక్షసమయంలో మాళవికను చూడడం వాళ్ళు కలుసుకోవడం, ధారిణికి ఈ విషయం ఐరావతిద్వారా తెలిసి మాళవికను కారాగారంలో ఉంచడం, చివరకు ఆమె రాజకుమారి అనీ, అమెను అగ్నిమిత్రునికిచ్చి వివాహం చేయాలనే అభిప్రాయంతో మంత్రి ఆమెను తీసికొని వస్తూండగా ఆమె దొంగలముఠా చేతిలో చిక్కి చివరకు ఏదోవిధంగా తన దగ్గరకు చేరిందనీ తెలిసి ధారిణియే స్వయంగా ఆమెను రాజుకు సమర్పిస్తుంది. ఇది కథా సంక్షేపం. గణదాసు తమనాట్య విద్యయొక్క వైశిష్ట్యాన్ని ఈ విధంగా వర్ణిస్తాడు.

"దేవానామిదమామనన్తి మునయః కాన్తం క్రతుం చాక్షుషం
రుద్రేణేద ముమా కృతవ్యతికరే స్వాంగే విభక్తం ద్విధా
త్రైగుణ్యోద్భవమత్ర లోకచరితం నానారసం దృశ్యతే
నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధా ప్యేకపం సమారాధకమ్" (1-4)

"ఎవరిమట్టుకు వారి కులవిద్య అంటే అభిమానం ఉండవచ్చు. ఐతే మాకు మానాట్య విద్యవిషయంలో ఉన్న అభిమానం అలాంటిదికాదు ఎందుచేతనంటే" - "ఇది దేవతలు నేత్రములతో చూచి ఆనందించవలసిన హింసాశూన్యమైన క్రతువు అని మునీశ్వరులు అంటారు, రుద్రుడు దీన్ని (లాస్యము తాండవము అని) రెండు విధాలుగా విభజించి పార్వతీసమేతమైన తన శరీరంలో ఉంచుకున్నాడు. మూడు గుణాలకూ సంబంధించిన, వివిధ రసాలుకల లోకచరిత్ర అంతా దానిలో చూడ

వచ్చు. ఈ విధంగా ఈ నాట్యం అనేది ఒక్కటే అయినా వేరువేరు రుచులుగల మానవుల్ని అనేకవిధాలుగా సంతోష పెడుతుంది".

ఉపాధ్యాయుల్లో ఉన్న తారతమ్యాన్ని గూర్చి చెపుతూ పరివ్రాజిక ఇలా ఉంటుంది. - ''కొందరి చదువు వారిదగ్గర ఉన్నంతవరకే బాగుంటుంది. కొందరిది ఇతరులకు బోధించినపుడు బాగున్నట్లు కనబడుతుంది. ఈ రెండూ బాగున్నవాడే ఉపాధ్యాయుల్లో శ్రేష్ఠుడు''.

> "శ్లిష్టా క్రియా కస్యచిదాత్మ సంస్థా సంక్రాంతి రన్యస్య విశేషయుక్తా
> యస్యోభయం సాధు స శిక్షకాణాం ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ''(1.16)

మాళవిక నాట్యపరీక్ష ఇస్తే రాజు ఎక్కడచూస్తాడో అని ధారిణికి అందుకు అంగీకరించదు. ఆ రహస్యం తెలియక గణదాసుడు అందులకు అనుమతి ఇవ్వవలసిందిగా ఆమెను ప్రార్థిస్తూ అట్లా కాకపోతే తాను వాదంలో ఓడపోయినట్లు ఔతుందనీ ఉపాధ్యాయుడైనవానికి అంతకంటె మరో అవమానం ఉండదనీ అంటాడు.

> ''లబ్ధా స్పదోఽస్మీతి వివాద భీరోస్తి తిక్షమాణస్య పరేణే నిందామే
> యస్యాగమః కేవల జీవికాయై తంజ్ఞాన పణ్యం వణిజం వదన్తి." (I-17)

''ఏదో రాజాశ్రయాదికం దొరికింది కదా అని సంతోషిస్తూ, వివాదాలలో దిగడానికి భయపడి, పరులుచేసే నిందను సహించే, ఎవడు, తనవిద్యను కేవలమూ ఆత్మపోషణంకోసం మాత్రమే ఉపయోగించుకొంటాడో వాడు జ్ఞానాన్ని అమ్ముకొని జీవించే వర్తకుడు''.

ఈ నాటకంలో కాళిదాసు 'మాయూరీ మార్జనా' అనే మృదంగ ధ్వని భేదాన్ని ఛలితమనే నాట్యభేదాన్నీ వర్ణిస్తూ తనకు ఆయా కళల్లో ఉన్న నైపుణ్యాన్ని ప్రదర్శిస్తాడు.

మాటల్లో చెప్ప శక్యంకాని విషయాన్ని పఠితల ఆలోచనకు వదిలేసి తద్వారా చెప్పదలచిన విషయాన్ని స్పష్టీకరించే శక్తి కాళిదాసులో అపారం రాజు మొట్టమొదట మాళవికను చూచినది చిత్రరువులో ఆమెకు నాట్యరంగంమీద ప్రత్యక్షంగా చూచినప్పుడు రాజు విదూషకునితో అంటాడు - ''ఆమెను చిత్తరువులో చూచినపుడు ఇంత సౌందర్యవతి ఈ లోకంలో ఉంటుందా? ఎవరో చిత్ర

కారుడు నేర్పుతో ఈ విధంగా చిత్రించినాడు అని అనుకొన్నాను. ఇపుడు ఈమెను ప్రత్యక్షంగా చూచినపుడు ఆ చిత్రకారు డెవడో అంత నేర్పరికాదేమో అనిపిస్తుంది''-

''చిత్రగతా యామస్యాం కాన్తి విసం వాదశంకిమే హృదయమ్
సంప్రతి శిథిలసమాధిం మన్యేయేనీవా మాలిఖితా.'' (II. 2)

నిజమైన ప్రేమ రహస్యాన్ని కాళిదాసు అగ్నిమిత్రునిద్వారా ఎలా చెపుతున్నాడో చూడండి. ''ఒకరికి ప్రేమఉండి రెండవ వారికి లేకుండాఉండే నాయికా నాయకులకు సమాగమం సమకూడినా నా కంతగా ఇష్టంకాదు. సమానమైన గాఢానురాగంకల ఇరువురు, సమాగమాశ వదులుకొని మరణించినా అది మంచిదే అని నా అభిప్రాయం.''

''అనాతురోత్క్రంఠితయోః ప్రసిద్ధ్యతా సమాగమేనాపి రతిర్నమాం ప్రతి
పరస్పరప్రాప్తి నిరాశయోర్వరం శరీర నాశోఽపి సమానురాగయోః''
(3-15)

విక్రమోర్వశీయము: ఊర్వశి నారాయణుని ఊరువునుండి జన్మించిన అతిలోక సౌందర్యవతియైన అప్సరస. ఆమె కైలాసనాథుని సేవించి సఖులతో తిరిగి వస్తూండగా ఒక రాక్షసుడు అపహరిస్తాడు. చెలికత్తెల ఆర్తనాదం విని పురూరవుడు తన విక్రమంచేత ఆ రాక్షసుణ్ణి జయించి, ఆమెను విడిపించి ఆమె ప్రేమకుపాత్రుడౌతాడు. పురూరవునియందు లగ్నమైనచిత్తంగల ఆఊర్వశి దేవేంద్రుని సమక్షంలో ఒకనాడు లక్ష్మీ స్వయంవరం అనే రూపకం ప్రదర్శించినపుడు లక్ష్మీ భూమికను గ్రహించడం జరిగింది. అపుడు 'పురుషోత్తముణ్ణి' అనడానికి బదులు పొరబాటున 'పురూరవుణ్ణి' అని అంటుంది. అందుకు కోపించి భరతముని నీకు స్వర్గనివాసం ఉండకుండుగాక అని శపిస్తాడు. ''పురూరవుడు నీయందు జన్మించిన కుమారుని ముఖం చూచిన పిమ్మట నీవు స్వర్గానికి మళ్ళీ రాగలవు'' అని దేవేంద్రుడు అనుగ్రహిస్తాడు. ఈ శాపంకూడా ఆ నాయికా నాయకులకు వరంగానే కనబడింది. వారు చాలకాలం సుఖంగా ఉంటారు. ఊర్వశికి ఆయువు అనే పుత్రుడు జన్మిస్తాడు. కాని తండ్రి ఆ పిల్లవాని ముఖం చూచినట్లైతే తాను స్వర్గలోకానికి తిరిగి వెళ్ళవలసివస్తుందని ఆమె ఆ కుమారుని తండ్రికంట బడకుండా చ్యవనాశ్రమంలో ఒక తాపసిదగ్గర దాచుతుంది. ఒకనాడు పురూరవునితో విహారానికై గంధమాదన పర్వతంమీదకు వెళ్ళిన ఊర్వశి, పురూరవుడు ఒక గంధర్వకన్య

వైపు చూచినాడనే కోపంతో, ఎంత బ్రతిమాలినా వినకుండా కుమార వసంతంలో ప్రవేశించి అక్కడ కుమార శాపంచేత లతగా మారిపోయింది. ఆమెకై విలపించి విలపించి చివరకు పురూరవుడు సంగమనీయమణి ప్రభావంచేత ఆమెనుపొందుతాడు. ఇంతలో ఆ తాపసి ఆయువును తీసికొనివచ్చి తలిదండ్రులకు వప్పచెపుతుంది. ఊర్వశి ఆజన్మాంతమూ పురూరవునితో ఉండడానికి ఇంద్రుడు అనుమతిస్తాడు.

రాక్షసునినుండి విడిపించిన ఊర్వశి సౌందర్యాన్నిచూచి ముగ్ధుడైన పురూరవుడు ఇలా అంటాడు :

''అస్యాః సర్గవిధౌ ప్రజాపతి రభచ్చంద్రోను కాంతిప్రదః
శృంగారైకరసః స్వయంను మదనో మాసోను పుష్పాకరః
వేదాభ్యాసజడః కథంను విషయవ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవేన్మనోహర మిదం రూపం పురాణోమునిః'' (I-10)

''ఈమెను చంద్రుడో, మన్మథుడో, వసంతుడో సృష్టించి ఉండాలి. అంతేకాని విషయ విముఖుడై, వేదాభ్యాసకుడుడై ఉన్న ఆ నారాయణముని సృష్టించినాడనడం అసంభావ్యం.''

''ఆమె శరీరము ఆభరణానికి ఆభరణం. ప్రసాధనానికి (అలంకరించుకోవడానికి) ప్రసాధనం ఉపమానానికి ప్రత్యుపమానం.''

''ఆభరణస్యాభరణం ప్రసాధనవిధే ప్రసాధన విశేషః
ఉపమానస్యాపి సఖే ప్రత్యుపమానం వపుస్తస్యాః'' (II. 3)

ఊర్వశి సఖియైన చిత్రలేఖ ఊర్వశియొక్క మదనతాపాన్ని పురూరవునికి తెలిపినప్పుడు ఆతడంటాడు :

''పర్యుత్సుకాం కథయసి ప్రియదర్శనాంతాం
ఆర్తం నపశ్యసి పురూరవసం తదర్థే
సాధారణోయ ముభయోః ప్రణయః స్మరస్య
తప్తేన తప్తమయసా ఘటనాయ యోగ్యమ్.'' (II. 15)

''నీ సఖురాలు బాధపడుతూన్నదని చెపుతున్నావుకాని నేను ఎంత బాధపడుతున్నానో గమనించడంలేదు. ఈ మన్మథతాపం ఇద్దరికి సమంగానే ఉంది. కాలిన లోహాన్ని కాలిన లోహంతో కలపడం సులభం.''

"దుఃఖం అనుభవించిన తరవాత లభించిన సుఖంలో ఆనందం ఎక్కువ ఉంటుంది. ఎండలో తిరిగినవానికి చెట్టునీడ సుఖం బాగా తెలుస్తుంది." రూపక ప్రదర్శనానికై స్వర్గలోకానికివెళ్ళి ఆలస్యంగా వచ్చిన ఊర్వశితో రాజు అన్న మాటలివి.

"యదౌవోపనతం దుఃఖాత్సుఖం తద్రస వత్తరమ్
నిర్వాణాయ తరుచ్ఛాయా తప్తస్యహి విశేషతః" (III. 21)

ఈ రూపకంలోని చతుర్థాంకంలో అంతా ఉన్మత్తుడైన పురూరవుని విరహబాధా ఆతడు పశుపక్ష్యాదులనూ, లతా వృక్షాదులనూ ప్రియురాలి జాడగూర్చి అతడు సంచరించిన విధానమూ వర్ణింపబడ్డాయి. ఇది రామాయణంలోని రామ విరహ బాధను జ్ఞప్తికి తెస్తుంది.

పెరిగి పెద్దవాడయిన ఆయువుకు పురూరవుడు తన తండ్రి అని తెలియగానే ఆయనయెడ అపూర్వమైన భక్తి భావం పుట్టుకొస్తుంది. "ఈయన నా తండ్రి నేను ఆయన పుత్రుణ్ణి అని తెలిసినంత మాత్రంచేతనే నాకింత స్నేహం కలుగుతూంది, చిన్నతనంనుంచీ తండ్రి ఒడిలో పెరిగిన వాళ్ళకు ఇంకా ఎంతప్రేమ ఉంటుందో!" అంటాడు.

"యదిహార్దమిదం శ్రుత్వా పితామ మాయం సుతోహమస్మీతి
ఉత్సంగవర్ధితానాం గురుషుభవేత్కీదృశః స్నేహః" (V-10)

ఇంక ఊర్వశి స్వర్గలోకానికి వెళ్ళవలసి ఉండడంచేత పురూరవుడు కూడా వానప్రస్థాశ్రమం స్వీకరించాలని అనుకుంటూ ఉంటాడు. అంతలో నారదుడు వచ్చి ఊర్వశి ఆజీవనాంతము పురూరవునికి సహధర్మచారిణిగా ఉండవచ్చుననీ దేవేంద్రుడనుగ్రహించినాడని చెప్పడంతో అందరూ ఆనంద పరవశులవుతారు. రాజు పల్కిన శ్లోకద్వయ రూపకమైన భరతవాక్యంతో ఈ రూపకం సమాప్తమౌతుంది.

"పరస్పర విరోధిన్యో రేకసంశ్రయదుర్లభమ్
సంగతం శ్రీ సరస్వత్యోర్భూతయేస్తు సదాసతామ్." (V. 24)

"సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు
సర్వః కామాన వాప్నోతు సర్వః సర్వత్రనందతు." (V. 25)

"లక్ష్మీ సరస్వతులు పరస్పర విరోధం కలవారు. ఐనా వారిరువురూ కలిసిఉండి సత్పురుషులందరికీ అభివృద్ధి చేకూర్తురుగాక." "ఎల్లరూ కష్టములు దాటుదురు గాక. ఎల్లరూ సుఖమును చూతురుగాక. ఎల్లరూ వారి కోరికలను పొందుదురుగాక. అన్ని దేశాల్లోనూ, అందరూ, ఆనందింతురుగాక."

ఇది కాళిదాసుకుఉన్న విశ్వమానవ సౌభ్రాత్ర భావానికి నిదర్శనం.

**అభిజ్ఞాన శాకుంతలము :**

"కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకున్తలా
తత్రాపిచ చతుర్థోంకః తత్ర శ్లోకచతుష్టయమ్."

"కావ్యాల్లో అందమైనది నాటకం. నాటకాల్లో అందమైనది శాకుంతలం. దాన్లో అందమైనది చతుర్థాంకం. అందులోనూ అందమైనవి నాలుగు శ్లోకాలు."

శాకుంతలకథ లోకప్రసిద్ధమైనది. ఏడంకాల ఈ నాటకంలో ఐదంకాల కథ తపోవనం పరిసరాల్లో జరిగింది. Tempest నాటకంలో షేక్స్పియర్, ప్రోస్పరో రూపంలో కనబడుతూన్నట్లు, ఈ నాటకం మొదటినుండి చివరివరకూ కాళిదాసు, కణ్వమహాముని రూపంలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో మనకు గోచరిస్తూనే ఉంటాడు. మన దేశానికి భారతదేశం అనీ పేరురావడానికి కారణ భూతుడైన భరతచక్రవర్తి తలిదండ్రులగాథ అత్యుదాత్తమైనది దీన్ని అంత ఉదాత్తమైన రీతిలోనూ నడిపించినాడు కాళిదాసు, ఈ నాటకంలో ఈ నాటక ప్రారంభంలో — "పెద్దలు మెచ్చుకొనే వరకూ నా నాటకరచనా ప్రావీణ్యాదుల విషయంలో నాకు విశ్వాసం లేదు" అంటూ కాళిదాసు సూత్రధారునిద్వారా తన వినయాన్ని ప్రకటిస్తాడు.

"ఆ పరిషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్
బలవదపి శిక్షితానాం అత్మన్య ప్రత్యయం చేతః" (1-2)

మృగయాసక్తుడైన దుష్యంతుడు ఒక లేడిని తరుముకొంటూ, తెలియ కుండానే కణ్వాశ్రమ పరిసరాలకి వెడతాడు. కణ్వాశ్రమ సమీపంలో ఉన్నామనే సంగతి తెలియగానే పూజ్య పూజావ్యతిక్రమం అనర్థదాయికమనే ఉద్దేశంతో, వినీతవేషంతో ఆశ్రమంలోకి ప్రవేశిస్తాడు. ఆశ్రమద్వారంలో అడుగుపెడుతుండ గానే ఎవరో యువతుల సంభాషణలు వినబడి చెట్లచాటునుంచి చూస్తాడు. అన

సూయ ప్రియంవదలతో మొక్కలకు నీళ్ళుపోస్తూన్న శకుంతల కనబడుతుంది. ఇంత సుకుమారాంగియైన ఈమెచేత ఈలాంటి పనులు చేయించడం నీలోత్పలద లంతో కట్టెలు కొట్టడం వంటిదే" అని వాపోతాడు.

> "ఇదం కిలావ్యాజ మనోహరం వపుః తపః క్షమః సాధయితుంయ ఇచ్ఛతి
> ధ్రువం సనీలోత్పల పత్రధారయా సమిల్లతాం ఛేత్తు మృషిర్వ్య వస్యతి''
> (1-18)

''అసలు సహజసౌందర్యమే ఉండాలికాని ఎలాంటి బట్టకట్టినా బాగానే ఉంటుంది, చంద్రునికి మచ్చకూడా ఒక అందమే. ఈమె నారచీర కట్టినా అందంగానే ఉంది'' అనుకొంటాడు.

> ''సరసిజమను విద్ధం శైవలేనాపి రమ్యం
> మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీంతనోతి
> ఇయమధిక మనోజ్ఞావల్క లేనాపి తన్వీ
> కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్'' (1-20)

ఇలా కొంతసేపు నిరీక్షించి నిరీక్షించి, ఏదోవంకమీద వాళ్ళ ఎదుటికి వెళ్ళి, చేసీ చేయనట్లుగా తన పరిచయం చేస్తాడు. ప్రథమ దర్శనంలోనే శకుంతలకు అనురాగోదయం అవుతుంది. రాజు వారితో జరుపుతూన్న సంభాషణలకి విఘ్నం వచ్చి, తన కోసమై వెదుకుతూ వస్తూన్న సైన్యాలదగ్గరకు వెళ్ళవలసివస్తుంది. ''శరీరం ముందుకునడచినా, మనస్సుమాత్రం గాలి కెదురుగా వెడుతూన్న రథంపై ఉన్న జండాగుడ్డవలె వెనుకనే వెడుతుందంటాడు.''

> ''గచ్ఛతి పురః శరీరం ధావతి పశ్చాదసంస్తుతం చేతః
> చీనాంశుక మివకేతోః ప్రతివాతం నీయమానస్య" (I-33)

ఆశకుంతలయొక్క సౌందర్యాన్ని గురించి వర్ణించి ఆ విదూషకునికి చెపుతూ

"ఈమెను బ్రహ్మ ముందుగా, ఏదోషాలులేకుండా, చిత్తరువులో చిత్రించి తరువాత ప్రాణంపోసి ఉంటాడు, అని అనిపిస్తూంది' అంటాడు.

> ''చిత్రేనివేశ్య పరికల్పితసత్త్వయోగా
> రూపోచ్చయేన మనసా విధినా కృతాను

స్త్రీరత్న సృష్టిరపరా ప్రతిభాతి సామే
ధాతూర్విభుత్వమను చింత్య వపుశ్చ తస్యాః'' (II-9)

''ఆమె వాసనచూడని పువ్వు. గోరుసోకని చిగురు, అనావిద్ధమైన రత్నం, ఎవ్వరూ రసం ఆస్వాదించని మధువు. ఎన్నో పూర్వజన్మ పుణ్యాల అఖండ ఫలం. దీనికోసం ఎవరు నోమునోచుకొన్నారో ? అంటాడు.

''అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధునవమనా స్వాదిత రసమ్
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూపమనఘం
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః'' (II-10)

ఏదోవిధంగా ఆశ్రమంలో కొంతకాలంపాటు ఉండాలని అనుకొంటూ ఉండగా అందుకు అనుగుణంగా - తాము చేసే యజ్ఞాన్ని సరంక్షించ వలసిందిగా మునులు దుష్యంతుణ్ణి కోరుతారు. దానితో విదూషకుణ్ణి ఇతర పరివారంతో సహా నగరానికి పంపివేసి తానొక్కడూ అక్కడ ఉండి, అటు యజ్ఞరక్షణ కార్యక్రమాన్ని నిర్వహిస్తాడు, ఇటు సఖురాండ్ర సమంక్షంలో శకుంతలని గాంధర్వ విధిచే వివాహ మాడతాడు. ఐదారు రోజుల్లో శకుంతలను నగరానికి తీసికువెడతానని చెప్పి వెళ్ళిపోతాడు. నగరమునుంచి దూతలు రావడం ఆలస్యం అవుతుంది. శకుంతల తదేక దృష్టితో దుష్యంతుని కోసం ఆలోచిస్తూ దుర్వాసునికి అతిథిమర్యాద చేయక పోవడంతో, 'నీవు స్మరిస్తున్న వ్యక్తి నిన్ను మరచిపోవుగాక' అని అతడు శపిస్తాడు. ఈ శాపం ఆమె వినలేదు కాని సఖురాలువిని ఆయన కాళ్ళమీద పడడంతో ఏదైనా ఆనవాలు చూపిస్తే స్మరిస్తాడులే' అని అతడు చెప్పి వెళ్ళిపోతాడు' ప్రయాణసమయంలో దుష్యంతుడిచ్చిన ఉంగరం ఉందికదా అని చెలికత్తెలు కొంత వరకూ సంతోషిస్తారు. ఇంతలో ప్రవాసంనుండి తిరిగివచ్చిన కణ్వమహర్షికి ఈ విషయం అంతా ఎలా చెప్పడమా అని వాళ్లు తటపటాయిస్తూండగా, అశరీరవాణి ద్వారా ఆయనకు ఆ విషయం తెలుస్తుంది. గర్భలక్షణాలు కనిపిస్తూన్న శకుంతలను దగ్గరకు తీసికొని కణ్వుడు 'మోహావేశంతో ప్రవర్తించినా, మంచివాని చేతిలోనే పడ్డావులే. అన్నట్లు "దిష్ట్యా ధూమాకులిత దృష్టేరపి యజమానస్య పావక ఏ వాకుతిః పతితా'' 'పొగకళ్ళు కప్పేసినా అదృష్టంచేత అహుతి అగ్నిలోనే పడింది' అంటాడు. ఆ రోజునే శకుంతలను భర్తృగృహానికి పంపడానికి సన్నాహాలుచేసి తనకు ఆ సమయంలో కలిగిన బెంగను ఈ విధంగా వ్యక్తపరుస్తాడు.

"యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠః స్తంభిత బాష్పవృత్తి కలుషశ్చిన్తాజడం దర్శనమ్
వైక్లబ్యం తుమతా వదీదృశమహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథంను తనయా విశ్లేషదుః ఖైర్నవైః'' (4 6)

''ఈ రోజున శకుంతల అత్తవారింటికి వెడుతుందంటే నాకు ఎంతో దుఃఖంకలుగుతోంది. పెంచిన ప్రేమకి అరణ్యంలో ఉండే నాకే ఇలా ఉంటే గృహస్థులకు ఎలా ఉంటుందో!'' (ఇది శ్లోక చతుష్టయంలో మొదటిది).

శకుంతల అత్తవారింటికి వెడుతూంది. మీరందరూ ఆమెకు వీడ్కోలు ఇవ్వండి అని తపోవనంలోఉన్న వృక్షాలని కోరుతాడు. (ఇది రెండవ శ్లోకం)

''పాతుం నప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషుయా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యేవః కుసుమ ప్రసూతి సమయే యస్యాభ వత్యుత్సవః
సేయం యాతి శకున్తలా పతిగృహం సర్వైరను జ్ఞాయతామ్'' (4-9)

"ఏ శకుంతల మీకు పోయకుండా తాను నీళ్ళు త్రాగేదికాదో, అలంకారములంటే ఇష్టమున్నా మీకు ఎక్కడ నొప్పికలుగుతుందో అని మీ చిగురుకూడా తుంపేది కాదో, మీరు పుష్పించునపుడు పండుగచేసుకొనేదో ఆ శకుంతల, ఇదిగో, అత్త వారింటికి వెళ్ళిపోతూంది. అనుజ్ఞ ఇవ్వండి.'' దుష్యంతునికి ఈ క్రింది సందేశం పంపుతాడు (మూడవ శ్లోకం)

అస్మాన్‌సాధు విచిన్త్య సంయమధ నానుచ్చైః కులంచాత్మనః
త్వయ్యస్యాః హథమ స్యబాంధవకృతాం స్నేహ ప్రవృత్తించతామ్
సామాన్య ప్రతిపత్తి పూర్వకమియం రారేషు దృశ్యాత్వయా
భాగ్యాయత్త మతః పరం నఖలు తద్వాచ్యం వధూ బన్ధుభిః.''

''మేము తపోధనులమనే మాట గుర్తుంచుకొని, నీ ఉన్నంతవంశ మర్యాద పాటిస్తూ, పూర్వభాంధవ్యం ఏమీ లేకపోయినా నీ విషయంలో ఈమె చూపుతున్న ఆ ప్రేమనుగూడా మన్నిస్తూ నీవు ఆమెనుకూడా నా ఇతర భార్యలతో సమంగా చూచుకో. అంతకుమించిన ప్రేమాదులను చూరకోవడం అనేది అదృష్టంమీద

ఆధారపడి ఉంటుంది. ఆ విషయంపట్ల పిల్లనిచ్చినవారు చెప్పవలసింది కాదు'' ఆమెకు ఈ విధంగా ఉపదేశిస్తాడు. (నాల్గవ శ్లోకం)

''శుశ్రూషస్వగురూన్ కురు ప్రియసఖీ కృత్తిం సపత్నీజనే
భర్తుర్వి ప్రకృతాపి రోషతయా మాసంప్రతీపం గమః
భూయిష్ఠం భవదక్షిణా పరిజనే భాగ్యేష్వను త్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః కలస్యాధయః'' (4-18)

''పెద్దవారిని సేవించు; సవతులను చెలికత్తెలుగా చూచుకో. ఏదైనా పొరబాట్లు ఉన్నా భర్తయెడ విరుద్ధంగా ప్రవర్తించకు, సాధ్యమైనంతవరకూ పరిజనుల విషయంలో దాక్షిణ్యంతో ఉండు. ఐశ్వర్యం ఉందికదా అని గర్వపడకు. ఈ విధంగా ఉంటేనే స్త్రీలు 'గృహిణులు' అనిపించుకొంటారు. లేకపోతే వాళ్ళు కులానికి పీడ పట్టించిన వాళ్లౌతారు''.

కణ్వశిష్యాదులు తీసికొని వచ్చిన శకుంతలను గూర్చి దుష్యంతుడు పూర్తిగా మరచిపోయి ఆమెను స్వీకరించడానికి నిరాకరిస్తాడు. ఆమె దగ్గరఉన్న ఉంగరం చూపుదామనుకుంటే అది ఎక్కడో నదిలో పడిపోయింది. ఇలాంటి అసహాయ పరిస్థితిలో ఉన్న శకుంతలనుజూచి, అమె తల్లియైన మేనక తీసికొనిపోయి హేమ కుటాగ్రంమీద ఉన్న అధితిమారీచప్రజాపతుల ఆశ్రమంలో, వారిరక్షణలో, ఉంచుతుంది. అక్కడ శకుంతలకు కుమారుడు పుట్టి పెరుగుతూ ఉంటాడు. ఇక్కడ మత్స్యం కడుపులో ఉన్న ఉంగరం ఒక ధావరునిద్వారా దొరకడంతో రాజుకు విషయం అంతా గుర్తుకువచ్చి దుఃఖాక్రాంతుడౌతాడు. తానెప్పుడోగీసిన శకుంతలాచిత్రాన్ని ముందు ఉంచుకొని విదూషకుడొకమూల ఓదారుస్తూండగా కాలక్షేపంచేస్తూంటాడు. ఇంకా ఆ చిత్రం కాలేదని అంటూ ఇంకా ఏమేమి వ్రాస్తే ఆ చిత్రానికి పూర్ణత్వం వస్తుందో ఈ విధంగా చెపుతాడు.

''కార్యాసైకతలేన హంసమిథునా స్రోతోవహామాలినీ
పాదాస్తామభితో నిషణ్ణహరిణా గౌరీగురోః పావనాః
శాఖాలంబిత వల్కలస్యచతరో ర్నిర్మాతు మిచ్ఛామ్యధః
శృంగే కృష్ణమృగస్య వామనయనం కండుయమానం మృగీమ్''(6-17)

''మాలినీనదీ, దాని ఇసుక తిన్నెమీద జంటజంటలుగా తిరుగుతూన్న హంసలూ'' ఆ నదిలోకి చొచ్చుకొనివచ్చిన హిమవత్పర్వతానికి సంబంధించిన చిన్నచిన్న

గుట్టలూ, వాటిపైన కూర్చున్న వేళ్ళు వీటినన్నింటినీ చిత్రించాలి. కొమ్మలకి నారచీరలు కట్టిన చెట్టుక్రింద నిలబడి మొగలేడి కొమ్ముమీద ఎడమకన్ను రాచి గోక్కుంటున్న ఆడలేడినికూడా వ్రాయాలి''. ఇంత పరిసరభూమి (Background) ఉంటేనే కాని శకుంతల చిత్రానికి పరిపూర్ణత్వం రాదంటాడు కాళిదాసులో దాగి ఉన్న చిత్రకారుడు.

దానవులలో యుద్ధంలో దేవేంద్రునికి సహాయం చేయడానికై దుష్యంతుణ్ణి తీసికొని వెళ్ళడంకోసం మాతలివస్తాడు. దుష్యంతుడు చాలా దుఃఖస్థితిలో ఉండడం చూచి అతనికి ఏదోవిధంగా కోపంతెప్పించి మాములు మనిషిని చేయాలనే ఉద్దేశంతో అతడు విదూషకుణ్ణి భూతం ఆక్రామించినట్లు ఆక్రమించి పీడిస్తాడు. అతని ఆర్తనాదం వినగానే ''ఏమి నాయింటిలోకూడా భూతాలు సంచరిస్తున్నాయా'' అంటూ – ''ఔను ! తన ఇంటిలోనే, తనలోనే ఏయేలోపాలు ఉంటాయో తెలుసుకోవడం కష్టం. అలాంటప్పుడు ప్రజల్లో ఎవరేమి చేస్తున్నదీ ఎవరు తెలుసుకోగలరు'' అంటాడు.

''అహన్యహన్యాత్మగ ఏవతావద్ జ్ఞాతుం ప్రమాద స్ఖలితం నశక్యమే
ప్రజాసు కః కేన పథా ప్రయాతీత్యశేషతో జ్ఞాతుమిహాస్తి శక్తిః'' (6-26)

దేవతలకు సహాయంచేసి తిరిగి వస్తూ మారీచ్యాశ్రయంలో ఆడుకొంటూన్న సర్వదమనుణ్ణి చూచి ముగ్ధుడైపోతాడు. ''దంతాంకురాలు కొంటెకొంటెగా కనబడేటట్లుగా అకారణంగా నవ్వుతూ, అస్పష్టంగా మధురంగా మాటలాడుతూ, పెద్దవాళ్ళ చంక ఎక్కడంకోసం ప్రయత్నంచేసే ఈలాంటి పిల్లల్ని ఎత్తుకొని, వారి వంటికున్న మట్టితో బట్టలుమాపుకున్న వారు ఎంత అదృష్టవంతులో కదా'' అంటాడు.

''ఆలక్ష్యదంతము కురానని మిత్తహాసై రవ్యక్త వర్ణరమణీయ వచః ప్రవృత్తీన్
అంకాశ్రయ ప్రణయిన స్తనయాన్వహ స్తః దన్యాస్త దంగరజసా మనిలీ భవన్తి'' (7-17)

ఆ పిల్లవాడు తన కుమారుడే అని తెలుసుకొని శకుంతలను కూడా కలుసుకొని వారిరువురితోటే అధితి మారీచ ప్రజాపతుల దర్శనం చేసుకుంటాడు. శాప వృత్తాంతం ఏమీ తెలియకపోవడంచేత, శకుంతల స్వయంగా ఎదురుగా వచ్చినపుడు

గుర్తించకపోవడమూ, ఉంగరంచూచి స్మరించడమూ ఇవన్నీ చూస్తే దుష్యంతునికే తన ప్రవృత్తి హాస్యంగా ఉన్నట్లు కనిపించి మారీచమహర్షితో ఇలా అంటాడు.

''యథాగజోనేతి సమక్షరూపే తస్మిన్నపక్రామతి సంశయః స్యాత్
పదానిదృష్ట్వాతు భవేత్ప్రతీతి స్తథావిధోమే మనసోవికారః.'' (7-31)

''ఏనుగును తీసికొనిపోయి ఎదురుగా నిలబెడితే, అది ఏనుగు కాదన్నాడట. అది వెళ్ళిపోతుంటే ఏనుగేమో అని సందేహం కలిగిందట; అది వెళ్ళిపోయిన తరువాత దాని అడుగులుచూచి, అది ఏనుగే అన్నాడట. అలా ఉంది నా మానసిక వికారం''.

అందుకు తగిన కారణం ఉందని తెలిసిన తరువాత శకుంతలా దుష్యంతులిరువురికీ కూడా కొంతవరకూ మనస్సు కుదుటపడుతుంది. వారు ముగ్గురికీ ఆ పుణ్యదంపతుల ఆశీస్సు లభిస్తుంది.

''మమాపిచ క్షపయతు నీలలోహితః
పునర్భవం పరిగతశక్తి రాత్మభూః''

చివరకు భరతవాక్యంలో కాళిదాసు పరమేశ్వరుడు నేనే మళ్ళీపుట్టకుండా చేయుగాక'' అని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు. కాలిదాసు వంటివాడు మళ్ళీ పుట్టినాడోలేదో తెలియదుకాని కాలిదాసువంటివాడు మళ్ళీ పుట్టలేదన్న విషయంలో మాత్రం సందేహం లేదు.

# నందిని




## మీ ఆత్మీయులతో ఆనందం పంచుకోండి
## ఒక్క రూపాయికే నందిని నందుకోండి

కేవలం ఒక్క రూపాయితో - భారత దేశంలో
మీ ఆత్మీయులు ఎక్కడున్నా సరే - సంవత్సరం
పాటు వాళ్ళు మిమ్మల్ని గుర్తుంచుకునేలా - మీ
ఆత్మీయతకు కొత్త అనుబంధాన్ని పెనవేస్తూ -
యువభారతిని వారికి పరిచయం చేసినందుకు
మిమ్మల్ని అభినందించేలా చేస్తూ - పన్నెండు
నెలలూ మీ ఆత్మీయుల్ని పలకరిస్తుంది 'నందిని'
అటు అందుకున్నవారికి ఆనందాన్నీ, ఇటు అంది
స్తున్న మీకు సంతృప్తినీ సమానంగా పంచిపెడ్తుంది-
'నందిని'

**మీరు ఎన్నైనా రూపాయలు పంపవచ్చు**
**అన్ని చిరునామాలూ పంపాలని గుర్తుంచుకోండి!**

ఉత్తర ప్రత్యుత్తరాలకు-
**యువభారతి**
5 కింగ్స్‌వే, సికిందరాబాదు, 500003

స్వయంగా వచ్చి కలవదలిస్తే: యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనాలు,
తిలక్ రోడ్డు, హైదరాబాదు, 500001


చుట్టూరా
ఆవరించుకునివున్న చీకటిని
తిట్టుకుంటూ కూర్చోవడంకంటె
ప్రయత్నించి
ఎంత చిన్నదీపాన్నయినా
వెలిగించడం మంచిది

అన్నవాక్యమే మా యువభారతికి ఊపిరి

# కాళిదాసు కవితా వైభవం


వ్యాఖ్యాత

డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు



ప్రచురణ




రిజిస్టర్ నెం. 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

KALIDASA KAVITHA VAIBHAVAM
Selections from KALIDASA'S
Poetic Works with Commentary
By Dr. P. Sreeramachandrudu


యువభారతి

ప్రచురణ : 51
ప్రథమ ముద్రణ : ప్రతులు 2,200
19 డిసెంబర్ 1976.

ముఖచిత్ర రచన, అక్షరాలంకరణ :
శీలా వీర్రాజు

ముద్రణ :
శివాజీ ప్రెస్, సికింద్రాబాదు.

ప్రతులకు :
యువభారతి
5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500 003.

వెల : రూ. 2-00

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరీమాళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పన్నెండేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటే ఇతరమైన సాత్విక సాధనంలేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమసాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇది యువభారతి 51 వ ప్రచురణ. ఇంతవరకు రెండులక్షల ఏభై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 4,400 మందికి పైగా సాహితీ మిత్రులు చేరారు. రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మాలక్ష్యసాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వతజీవిత సభ్యత్వ పథకాలలో ఆరువందల మందికి పైగా భారతీమిత్రులుగా, యాభైమంది భారతీ భూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలోనైనా సభ్యులుగా చేరి మా ''నందిని'' మాసపత్రికను ఉచితంగా పొందేఅవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. 'నందిని'లో యువభారతి కార్యకలాపాల వివరాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

డిసెంబరు 19, 1976.

ఇరువెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు



# మామాట

సమన్వయ దృక్పథం ప్రజాస్వామ్య పరిరక్షణకు తోడ్పడుతుంది. ఉత్తమ సాహిత్యాధ్యయనం సమన్వయ సాధనకు తొలిమెట్టు. బహుజన హితంకోసం, బహుజన సుఖంకోసం మనిషి ప్రతిభ వ్యక్తంకావాలి. మనిషిలో స్వతసిద్ధంగా, అంతర్నిహితంగాఉన్న మానవత్వాన్ని జాగరితం చేయగలిగే శక్తి సాహిత్యానికే ఉన్నదన్న నమ్మకంతో, ఉత్తమ సాహిత్యాధ్యయానికి అనువైన పుస్తక ప్రచురణ, సాహిత్య సమావేశాలు, గోష్ఠులు నిర్వహిస్తూ యువభారతి కడచిన పన్నెండేళ్ళుగా తెలుగు ప్రజల సంస్కృతి వికాసానికి యథోచితంగా కృషిచేస్తున్నది.

ప్రాచీన, ఆర్వాచీన సాహిత్యాలలో దిఙ్మాత్రంగానైనా పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో, సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న సమస్యలను సునిశితంగా సమవేదనా దృక్కోణంతో పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో యువభారతి 'సాహితీ వాహిని' పరంపరను ప్రచురిస్తున్నది. ఈ పరంపరలో ఇంతవరకు వెలువడినవి కేవలం సాహిత్యాధ్యయనానికి సంబంధించినవే. ఇక ముందు ముంద కౌటుంబిక, సాంఘిక, వైజ్ఞానిక విషయాలకు సంబంధించిన పుస్తకాలనుకూ ప్రచురించి పఠితృలోకానికి అందజేయడానికి ఏర్పాట్లు చేస్తున్నాము.

కాళిదాస కవితా సమాలోచనం భారతీయుల కళావివేచనమే! భారతీయు నిత్య జీవితంలో కాళిదాసు కవిత్వానికే పర్యాయపదం. అతణ్ణి చదువనివా నిజంగా చదువనివాడే! భారతీయుల సంస్కృతిలోని సౌందర్యాంశాలనూ, జీవిత న్నత ప్రమాణాలనూ, ఆదర్శాలనూ కాళిదాసు కవిత వ్యంజిస్తుంది. శైలీసారళ్య కవిత నెంత ఆస్వాదనీయంచేస్తుందో కాళిదాసు తన కావ్యాల్లో నిరూపించాడు. అందు అతణ్ణి ప్రత్యక్షరంగా కొందరు అనుసరిస్తే, కొందరు అతని భావాలకు అద్దంప కవులనుపించుకున్నారు. తమ భావాలకు ప్రాచుర్యం రావాలనే పేరాసతో కాళిదా పేరుతో చెలామణిచేసిన సందర్భాలను విమర్శకు లెత్తిచూపారు. కాళిదాసుకు చె

బడి అలాంటిది మరి. ఏదో ఒక విధంగా కాళిదాసు తమను ప్రభావితులను చేసినాడనే యాథార్థ్యాన్ని ఉన్నతశ్రేణికిచెందిన రచయితలందరూ భంగ్యంతరంగా చెప్పికొన్నారు. ఋషికల్పుడైన కాళిదాసు కవిత దేశకాలాలు గీచిన గీట్లనుదాటి నేటికీ ప్రసరిస్తూనే ఉంది. అందుకే ఆయన విశ్వకవి.

కాళిదాసు కావ్యారామంలోని కొన్ని కుసుమాలను దూసి రసపరీమళాలను ఆఘ్రాణించండని ఆహ్వానిస్తున్నారు శ్రీశ్రీ రామచంద్రుడుగారు.

డా. పుల్లెల శ్రీరామచంద్రుడుగారు మద్రాసు ప్రాచ్య కళాశాలలో సాహిత్య, వ్యాకరణ, వేదాంత శాస్త్రాలను అధ్యయనం చేసినవారు. సంస్కృతం, హిందీ, ఇంగ్లీషులలో ఎం. ఏ. పట్టాలను సంపాదించినవారు. రవీంద్రుని 'గీతాంజలి'ని మందాక్రాంత వృత్తాలలో సంస్కృతంలోకి అనువదించి ఉత్తరప్రదేశ ప్రభుత్వ బహుమతి నందుకున్నవారు. రాఘవ శతకం, కుమతీ శతకంవంటి తెలుగు కావ్యాలనుకూడా వెలియించారు. సిద్ధాంత కౌముదికి తెలుగు వ్యాఖ్యానాన్ని వెలయించినవారు. 'సురభారతి' ద్వారా జంటనగరాల్లో సంస్కృతభాషాసాహిత్యాల ప్రాచుర్యానికి కృషి చేస్తున్న సాహితీ బంధువులు. మా 'యువభారతి'కి ఆప్తులు. 'కాళిదాస కవితా వైభవాన్ని' తెలుగు ప్రజలకు అందించే అవకాశాన్ని ప్రసాదించిన ధన్యాత్ములు. విద్వాంసులై ఉండికూడా రసహృదయాన్ని పెంపొందించుకున్న సహృదయులు. తిరుపతి ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ లో ఆచార్యపదవిని అధిష్ఠించబోతున్న శ్రీశ్రీ రామచంద్రుడుగారిని అభినందిస్తూ, ఆయన సాహిత్య ప్రణయానికి అభివందనాలను అర్పిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు

19-12-1976